# పద్యరత్న భాండాగారము.

విద్యార్థుల యుపయోగముకొఱకు

పరిచ్చ కూర్పఁ బడినది.

ఆరవ కూర్పు.

Price 6 As.



VIZAGAPATAM:

PRINTED AT THE ALMA PRESS.

1916.

To

**Dr. D. DUNCAN, M. A.,**

DIRECTOR OF PUBLIC INSTRUCTION,

**MADRAS,**

**As a token of respect**

**for his endeavours to improve**

*THE VERNACULARS OF SOUTHERN INDIA.*

## మొదటి కూర్పునకు

### పీఠిక.

---

ప్రత్యేకముగాఁ బాఠశాలలలోని విద్యార్థులకుఁ బఠనీయము లైన పద్యగ్రంథము లెన్నో కనుపట్టవు. అట్టిగ్రంథములయొక్క ప్రధానోద్దేశము భాషాబోధనమై యుండవలయునన్నది అందఱు నంగీకరించిన విషయము. ఆయుద్దేశము నెఱవేఱుట కు గ్రంథమునందలి భాష సలక్షణమై యుండుటయెకాక శబ్దాన్వయభావాదులు ఆయాతరగతులకుఁ దగినట్లు క్రమముగా హెచ్చెడికాఠిన్యము గలవై యుండుటయు ఆవశ్యకము. మఱియుఁ బాఠకుల కాసక్తిని బుట్టించుటకు ఉక్తిమాధుర్యమును ముఖ్యముగా నెన్నఁదగినదే.

భాషమాట యిటుండఁగా, విషయమును మిక్కిలి జాగ్రత్తతోఁ జూడఁదగినదై యున్నది. తఱచుగా నాంధ్రపద్యగ్రంథములకు ముఖ్యవిషయములయిన శృంగారవేదాంతములు విద్యార్థుల పుస్తకములలో స్మరింపఁదగినవే కావు. నీతిబోధకములు గానున్న భాగములలోనయినను కేవలము కంఠోక్తిగా నీతులను జెప్పు పద్యము లంత ప్రశస్తములని నే నెన్నను. పొడిమాటలకంటె దృష్టాంతకథలు బాలురకు నీతిని చక్కఁగా మనసునఁ బట్టింపఁగలవు.

అయినను గ్రంథము మొదటనుండి తుదవఱకు నిట్టి నీతికథలతో నిండియుండుటయు మిక్కిలి లాభకరమని నేఁ దలఁపను. మనోహరములయిన కావ్యవస్తువర్ణనాదులును నడుమనడుమఁ జే

ర్పఁబడిన పక్షమున నివి విషయమునందు కొంతమార్పును గలిగించి పిల్లల కుల్లాసమును బుట్టించును.

ఇట్టియూహాలతో నీపద్యములను మహాకవుల కృతులనుండి యేర్చికూర్చినాను. నాయూహ లెంతవఱకు నాదరింపఁదగినవో, ఇందలి పద్యములు నాయుద్దేశముల నెంతవఱకు నెఱవేర్పఁగలవో, బాలుర విద్యాబుద్ధుల యభివృద్ధియందు జాగరూకులయిన మహాజనులే నిశ్చయింపఁగలవారలు.

తే ౧౯ ది జూను }
౧౮౯౭ సం॥రము. }

---

ఈపుస్తకము చెన్నపురి డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వారు 4, 5 ఫారముల విద్యార్థులకుఁ బఠనీయముగా నంగీకరించినారు.

(ఫోర్టు సెంటు జార్జి గెజెటు 16-8-98— I B —462)

తే ౧౦ ది జనేవరి }
౧౮౯౯ సం॥రము. }

---

# III

## మూడవకూర్పునకుఁ బీఠిక.

ఈకూర్పున పద్యపాదములు వేఱు వేఱు పంక్తులుగా వేయఁబడినవి. మఱియు ఈపుస్తకము 4, 5 ఫారములకు పఠనీయముగా నంగీకరింపఁబడినందున, ఇంతకు మునుపు మూడుభాగములుగా నున్నను, ఇప్పుడు గ్రంథమంతయు రెండుభాగములుగానే విభజింపఁబడినది.

తే ౨౦ ది జనేవరి }
౧౯౦౫ సంll రము. }

# విషయసూచిక.

## ప్రథమ పేటి.



## ద్వితీయ పేటి.

శ్రీరస్తు.

# పద్యరత్నభాండాగారము.

## ప్రథమపేటి.

### హేమంతఋతువు.

ఉ. ఉత్తరపుగాలి విసరె. వి
యత్తలమునఁ దుహినకరుఁ డహితుండయ్యెన్,
ఎత్తె ననల్ సేమంతులు
నెత్తమ్ములు దఱిగె, హిమము నెలకొనియె నృపా.

క. అహములు సన్నములయ్యెను,
దహనము హితమయ్యె దీర్ఘదశలయ్యె నిశల్,
బహుశీతోపేతంబై
యుహుహుహూయని వణఁకె లోక ముర్వీనాథా. ౨.

* * * * * * *

గీ. పొడుపుఁ గొండమీఁదఁ బొడుచుట మొదలుగాఁ
బరువు వెట్టి యినుఁడు పశ్చిమాద్రి

మఱుఁగుసొచ్చెఁ గాక మసలినఁ జలిచేతఁ
జిక్కెఁజిక్కెననఁగఁ జిక్కకున్నె. ౩.

* * * * * * *

గీ. శంభుకంట నొకటి జలరాశి నొక్కటి
మఱియు నొకటి మనుజమందిరముల
నుదిఁగెఁ గాక మెఱసియున్న, మూఁడగ్నులు
చలికి నోడి భక్తి సలుపకున్నె. ౪.

భాగవతము.

## కచునికథ.

క. ఏను గచుండనువాఁడ మ
హానియమసమన్వితుఁడ, బృహస్పతిసుతుఁడన్,
మానుగ వచ్చితి నీకును,
భానునిభా, శిష్యవృత్తిఁ బనిసేయంగన్. ౧.

వ. అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును వినయప్రియవచన మృదుమధురత్వంబును ననవరత నియమవ్రతపరికాశిత ప్రశాంతత్వంబును జూచి శుక్రుం డతిస్నేహంబున వీనిం బూజించిన బృహస్పతిం బూజించిన యట్ల యని యభ్యాగతపూజల వాని సంతుష్టుంగాఁ జేసి శిష్యుంగాఁ జేకొని యున్నంత నక్కచుండు.

సీ. పనియేమిపంచినఁ బదపడిచేసెద
ననక తన్ బంచినయాక్షణంబ

చేయుచు నిజగురు చిత్తవృత్తికిఁ గడు
నమకూలుఁడై వినయంబుతోడ
మనమునఁ జెయ్వుల మాటల భక్తి నే
కాకారుఁడై మఱి యంతకంటె
దేవయానికి సువిధేయుఁడై ప్రియహిత
భాషణములఁ బుష్పఫలవిశేష
దానములను సంతతప్రీతిఁ జేయుచు
నివ్విధమునఁ బెక్కులేండ్లు నిష్ఠ
గురుని గురుతనూజఁ గొలిచి యయ్యురువుర
నెమ్మి వడసెఁ దనదు నేర్పు పేర్మి ౨.

వ. ఇట్లు గురుశుశ్రూషా గౌరవంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుండయి యున్న నెఱింగి దానవులు సహింపనోపక బృహస్పతితోడి వైరంబున నక్కచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు వనంబున నేకతంబ యున్న వాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించి చనినంత నాదిత్యుం డస్తగిరి శిఖర గతుండగుడు, మగిడి హోమధేనువు లింటికి వచ్చిన, వానితోడన కచుండు రాకున్న దేవయాని తనమనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె. ... ... ...

ఉ. వాఁడె మయూఖముల్ గలుగు
వాఁ డపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్
నేఁ డిట వచ్చె నేకతమ,
నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్

పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ,
బ్రొద్దునుబోయెఁ, గచుండు నేనియున్
రాఁడు, వనంబులోన మృగ
రాక్షసపన్నగబాధ నొందెనో. ౩.

వ. అనిన విని శుక్రుండు తన దివ్యదృష్టింజూచి యసురవ్యాపాదితుండైన కచుంగని వానిం దోడ్కొని తేర మృతసంజీవనిం బంచిన, నదియును బ్రసాదం బని యతిత్వరితగతిం జని విగతజీవుండైన కచు నప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని వచ్చినం, జూచి శుక్రుండును దేవాయానియు సంతసిల్లి యున్నంతఁ గొన్ని దినంబులకు వెండియు నొక్కనాఁడు.

క. అడవికిఁ బువ్వులు దేరఁగ
వడి నరిగిన కచునిఁ జంపి వానిని దనుజుల్
పొడవుసెడఁ గాల్చి సురతోఁ
దడఁక యబ్బ్వాది శుక్రుఁ ద్రావించి రొగిన్. ౪.

వ. శుక్రుండును సురాపానమోహితుం డయి యున్నఁ, దొల్లింటియట్ల దేవయాని కచుంగానక దుఃఖితయై నేఁడును గచుండు రాకమసలె, నసురులచేత నిహతుండయ్యెఁ గావలయు, నని శోకించిన, దానింజూచి శుక్రుం డిట్లనియె.

క. వగవక సంజీవని పెం,
పగణిత గర్వమున నసురు లా కచుతోడం
బగఁగొని చంపెద, రాతఁడు
సుగతికిఁ జనుగాక, యేల శోకింపంగన్. ౫.

వ॥ అనిన దేవయాని యిట్లనియె.

మ. మతిలోకోత్తరుఁడైన యంగిరసు మ
న్మం డాశ్రితుం, డా బృహ
స్పతికిం బుత్రుఁడు, మీకు శిష్యుఁడు, సురా
ప బ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ, డకారణంబ దనుజ
వ్యాపాదితుండైన, న
చ్యుతధర్మజ్ఞ, మహాత్మ, యక్కచున కే
శోకింప కెట్లుండుదున్. ౬.

వ. వానిం జూచికాని కుడువ నొల్లనని దేవయాని యేడ్చుచు
న్నఁ, బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండయి శుక్రుండు తన
యోగదృష్టిం జూచి లోకాలోకపర్యంతభువనాంతరంబునఁ
గచుం గానక సురాసమ్మిశ్రభస్మమయుండై తనయుదరంబు
న నున్న యక్కచుంగని సుర చేసిన దోషంబును నసురులవ
లన నయిన యుపకారంబు నెఱింగి.

గీ. మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కు చేసి పడయఁబడిన
యట్టియెఱుక జనుల కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ చేయనగునె. ౭.

క. భూసురు లాదిగఁగల జను
లీసుర సేవించిరేని యిదిమొదలుగఁ బా
పాసక్తుఁ బతితు లగుదురు,
చేసితి మర్యాద, దీనిఁ జేకొనుఁడు, జనుల్. ౮.

వ. అని శుక్రుండు సురాపానంబు మహాపాతకంబుగా శపియిం
చి తనయుదరంబుననున్న కచు నప్పుడ సంజీవితుం జేసిన,

నందయుండి కచుండు శుక్రున కిటనియె

క. తనువును జీవము సత్త్వం
బును బడసితి నీప్రసాదమున, నీయుదరం,
బనఘా, వెలువడు మార్గం
బానరింపుము నాకు, భూసురోత్తమ, దయతోన్.

వ. అనిన నాయుదరంబు భేదిల్లినంగాని యిమ్ముని కుమారుండు వెలువడనేరం, డుదరభేదనంబున మూర్ఛితుండనైన నన్ను సంజీవితుం జేయువలయు, నని శుక్రుండు కచునకు సంజీవని నుపదేశించిన.

క. ఉదరభిదాముఖమున న
భ్యుదితుండై నిర్గమించె బుధనుతుఁడు కచుం,
డుదయాద్రిదరీముఖమున
నుదితుండగు పూర్ణహిమమయూఖుఁడువోలెన్.

వ. అంత.

విగతజీవుఁడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁడై వెలింగె
దనుజమంత్రి, యుచ్చారణ దక్షుచే
నభిహితం బగు శబ్దంబునట్లపోలె.

## సువర్ణష్ఠీవి.

క. జనపాల, సృంజయుండను
మనుజేంద్రుఁడు పుణ్యమూర్తి మహిమాస్పదుఁ డై

వ్యానిధి వలయములోని య
వని నెక్కడ యేలు దుగ్ధ వారస్ఫురణన్. ౧.

వ. సంతానార్థియై సంతతంబును భూసుర పూజనంబులు సేయుచుండు, నాధారుణీపతికి నారదుండు సఖుండగుట నతనిపాలికిం బలుమాఱు నరుగుదెంచుటం జేసి యొక్కనాఁడు విప్రవరు లతిప్రయత్నంబునం గూడికొని యమ్మునివరునితో నిమ్మహీపతి కోర్కి దీర్పంగదే యని చెప్పిన.

క. అతఁ డతనితోడ భవదీ
ప్సిత మెయ్యది నాకు నేలచెప్ప వనుడు, నం
చితగుణుఁడు రూపసియు నగు
సుతుఁగోరుదు నెపుడు నేను, సురగణవంద్యా. ౨.

వ. అక్కుమారుండు మూత్రపురీష లాలాశ్రుస్వేదంబులు సువర్ణమయంబు లగునట్టివాఁడు గావలయు, ననిన నమ్మహీపతికి నమ్మహాత్ముం డవ్వరం బిచ్చె; నాసృంజయుండు నత్తెఱంగు తనయుంబడసి సువర్ణష్ఠీవి యను పేరిడి ప్రియంబునం బెనుచుచు వానివలనం గనకం బనుదినంబు నుత్తరోత్తరాభివృద్ధి యగుచుండ సమృద్ధి నొంది శయనాసన సదనప్రాకార ప్రభృతి సమస్తవస్తువులను గాంచనమయంబులఁ గావించుకొని యసమానమహిమానందంబునఁ బ్రకాశుండై.

క. విలసిల్లుచు నుండఁగ, ముచ్చిలి పట్టి కుమారు నోరఁ జీరదుఱిమి వెం
గలులగు కూఁతురులు కొందఱు
వెలువడఁ గొనిపోయి యొక్క విపినములోనన్. ౩.

గీ. కడుపువ్రచ్చి యొడలు కలయంగఁ జల్లించి

పాపిపాపిచూచి పసిఁడి గాన
కచట శవము వైచి యరుగుచునుండె, త
త్కర్మ ఫలము తమ్ముఁ గలఁచుటయును. ౪.

వ. ఆపాపాత్ములు తమలోనం గలహించి యొండొరుల వధియిం
చి యందఱు నధోగతిం బొందిరి.

భారతము.

## కుక్క బుద్ధి.

సీ. వినుమొక్కయితిహాస, మనుపమంబగు తపం
బునఁ బేర్చువాఁ డొక్కమునివరేణ్యు
నాశ్రమంబునఁ దద్దయావిశేషంబున
నఖిలజంతువులును నచటఁ బ్రీతి
వసియించి సుఖముండు, వానిలో నొక్కకు
క్కుర మెప్డు భక్తిమైఁ గొలిచి తిరుగు,
నమ్ముని మెలఁగిన యచట నెల్లను దాను
వర్తింప, నొకదువ్వి వైర మెత్తి
కఱవవచ్చిన, నమ్మునికడకుఁ బాఱు
దెంచె నాకుక్క; యాతఁడు దీప్తరూప
మైనదువ్విగాఁ జేసిన, నది గడంగి
కవియ భయమంది పాఱె మున్నవియుదువ్వి. ౧.

సీ. అట్లు బెబ్బులి వచ్చి యడరిన బెబ్బులి
గాఁ జేసి గెలిపించెఁ గరుణ మెఱయ;

నొకమత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన
 నుద్ధతిఁ గరిఁ జేసి యొసఁగె జయము;
సింహంబు దెస భీతిఁ జెడి పాఱు దెంచిన
 ఘనసింహముగఁ జేసి గర్వ మిచ్చె;
శరభంబుధాటికిఁ జకితమైనను దగ
 శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె;
నిట్లు దివసక్రమంబున నెక్కుడయిన
సత్త్వముగఁ జేయగాఁ, గుక్క శరభభావ
మండితంబయి తిరుగుచునుండి పూర్వ
వాసనానీచమగు మనోవర్తనమున. ౨.

వ. ఇట్లని విచారించె.

చ. ననుఁగని యొండుసత్త్వము మ
 నంబున బెగ్గిలి పాఱునప్పుడి
మ్మునివరుఁ డిట్టువోలెఁ గృప
 మొక్కలమై శరభంబుగాఁగఁ జే
యునె తగదాని, నట్లయిన
 నుద్ధతి నాకుఁ జరింప లేదు, కా
వున నితని న్వధింతు వెర
 వు న్బలము న్సరి నుల్లసిల్లఁగన్. ౩.

గీ. అనువిచారంబు దివ్యబోధాత్ముఁడైన
యమ్మునీశ్వరుఁ డెఱిఁగి, యీయధమజాతి
యున్నతస్థితి మెఱుఁగునే, మున్నువోలెఁ
గుక్కయై యుండుగా, కన్నఁ గుక్కయయ్యె. ౪.

భారతము.

## దీర్ఘదర్శి మొదలగు మత్స్యముల తెఱఁగు.

వ. దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుఁడును దీర్ఘసూత్రుండును నను మత్స్యంబులు మూఁడు జలచరబహులంబగు నొక్కయేటిమడుఁవునఁ దమలోఁ బొందుగలిగి యుండ వేసవి వొచ్చిన దీర్ఘదర్శి తక్కటి రెంటిని గూడంబిలిచి.

క. మడు వింకెఁగఁ, బాఱెడు నీ
రెడఁదెగ్విన, నెందుచోటికేగఁగరా దీ,
వృడు నింకని నీళ్ళులుగల
మడువునకుం బోవవలదె మన కిట్టియెడన్. ౧.

గీ. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె, నేది
ప్రాప్తమయ్యె నక్కార్యంబు భంగి నెఱిఁగి
యప్పటికిఁ దగినట్లు సేయంగవలయు
మానితోపాయవృత్తి నేమఱుట లేక. ౨.

వ. అనిన నయ్యిరువెఱంగుల పలుకులు విని దీర్ఘసూత్రుం డిట్లనియె.

క. జడనిధి చందంబున ని
మ్మడు వొప్పఁగ నిప్పుడేమి మాఁడెను నిమ్మై
వడిచెడ, రిత్త నెవ్వగ
లుడుగుఁడు, మఱి చూచుకొంద మొయ్యన తఱితోన్. ౩.

క. అనుటయు నిది కర్జముగా
దని పలుకుచు దీర్ఘదర్శి యంబుస్రోతో
జనితాభయమగు పథమునఁ
జని చొచ్చెం బెద్దమడువు సమ్మదలీలన్. ౪.

వ. తక్కిన రెండును నంద నిలిచె, నిట్లు నిలిచిన యమ్మత్స్యద్వ
యంబునకు భయంబుపుట్టం గతిపయదివసంబులకు.

క. పాతెడునీరెడఁ ద్రివ్వఁగఁ
దాఱి, బెడిదమైనయొండ దనుకఁగ, నివురం
బాతె మడు, వంత వేడుక
కాఱులు జాలరులు సూచి క్రందుకొనంగన్. ౫.

క. వెరవున నూఁదుల నెత్తెలఁ
గరముల మత్స్యములఁ బట్టి కడు సంతసముం
బొరయుచుఁ దార్ఢ్యం గ్రివ్వఁగ,
గరమూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుఁడనున్. ౬.

క. ఇం దొకత్రాడు గఱచి యే
నెందంగా గ్రుచ్చినట్ల యుండెద, వీరల్
గ్రందుకొనుట మానంగ, న
మందత నది వెడలవిడిచి మడువు దఱిసెదన్. ౭.

క. అని యొక గుదిమీలనడుమ
నెనయంగాఁ దూఱి కఱచి యిరుదాడలఁ ద్రా
డొనరంగఁ బట్టుకొని గ్రు
చ్చినచందముదోఁప మూర్ఛఁ జెందినభంగిన్. ౮.

వ. ఉన్నంత వేఁటదీఱె యగ్గుదిగలయుతండు.

క. తెలినీట రొంపివోవం
దొలఁచునెడం ద్రాడు విడిచి దురితంబునకుం
దొలఁగి పొరదప్పియొక్కొక
జలచర మున్న యెడ కేగె సంభ్రాంతమతిన్. ౯.

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం
డిట్టట్టరుగంగ నుపాయ మేదియు నెఱుఁగక నిచ్చేఁ
బట్టువడుఁ దనదు డెందము
పట్టువదలి చకితవికలభావేంద్రియుఁడై. ౧౦.

క. విను, దాఁ దవ్వులఁ గార్యము
గనుఁగొని వలయుపని మున్నుగా వింపఁగ నే
రని జనుఁడు దీర్ఘసూత్రుం
డను నమ్మత్స్యంబుభంగి నాపద నొందున్. ౧౧.

గీ. అప్పటికిఁ దోఁచినట్టులు తప్పకుండ
ననువుతో ధృతిగల్గి కార్యంబు నడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞుని యట్లపోలెఁ
బరమసంశయమయ్యెడు బ్రిదుకు గాంచు. ౧౨.

క. ధుర్యత ననాగతములగు
కార్యము లూహించి పని తగం జేయునయా
చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును
నార్యస్థితి దీర్ఘదర్శియను మీను క్రియన్. ౧౩.

భారతము.

## గృధ్రజంబుకోపాఖ్యానము.

సీ. గాంగేయుఁ డిట్లనుఁ గౌరవపూర్వజు
    నకు, విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁడైన, బంధులు ప్రేతభూ
    మికిఁ గొనిపోయి యమేయశోక

వివశాత్ములై పలవింపఁగాఁ గ్రద్దయొ
క్కటి వచ్చి మీార లిచ్చట భయంబు
దక్కి యేడ్చుచునుండఁ దగ, దిదె కుప్రింకెదుఁ
బొద్దు, రాక్షసులును భూతములుఁ బి
శాచములువచ్చి తినుటకు వేచితిరుగు,
జననమరణము ల్వింత లె, చన్న శిశువు
తోన యందఱుఁ జనుటకుఁ బూనియుండు
వార లే, పొండు పీనుఁగు వైచి వేగ. ౧.

క. తెగిపోయిన వా రేడ్చిన
మగుడుదు రే వెళ్లులార, మానుఁడు, మీారుం
దెగుదురు తడసిన, నావుడు
నగునిట్టిద కర్జమనుచు నందఱు భీతిన్. ౨.

వ. శవంబు విడిచిపోవం జూచిన, నుక్కనక్క బొక్కలోనుండి
వెడలి వారలతో ని ట్లనియె.

సీ. గ్రద్దమాటల కేల కడుభీతిఁ బొందితి,
రక్కటా బాలుని నబ్జవదను
నిటు వైచిపోవఁ గా ళ్లెట్లాడె, నేడ్వఁడు
శోకంబుపోవ నిచ్చోటఁ గొంత
ప్రొ, ద్దంతలో, విధికూ్రరుండు గాకున్నఁ,
బ్రాణంబు క్రమ్మఱ రాక గల్గు
నో యెఱుంగుదు రే, యినుండు నస్తాద్రికిఁ
జే రెడు, వెఱవక మీారు నిలువుఁ,
డనఁగ వారు మనమ్మున నాస పుట్టి
మగిడి వచ్చిన, గ్రద్ద, యిమ్మందబుద్ధి

మైన నక్క మాటలు వినదగు నె, వికృత
మయ్యెం జీనుఁగు, వచ్చునే యసువులింక. ౩.

క. కడుఁ బెట్టిదుండు కాలుఁడు
మిడుకుమిడుకు నవహరించె, మీ రీయాసల్
విడువుఁడు, బాలునికి సుగతి
వడయుఁడు దానాదులైన బహుధర్మములన్. ౪.

వ. అని పలికిన నాగృధ్రంబు వచనంబు లాక్షేపించి యజ్ఞంబు కంబు వారల నుద్దేశించి.

క. కూరిమతి గృధ్ర, మిట్టి కు
మారకునిం జూచిచూచి మసలక పోవ
న్నేరె ట్లోర్చెదరో, క
న్నీరిటు మముబోంటులకును నిలువ కొలకెడున్. ౫.

క. దయమాలి పోవనేటికిఁ,
బ్రియత్నమునఁ బొదువ దైవబలమున నీకుం
బ్రియమెసఁగ బ్రిదుకు, బ్రదుకం,
డయినను మఱి పోవరాదె, యని చెప్పుటయున్. ౬.

వ. గృధ్రం బి ట్లనియె.

గీ. ఏను బుట్టి వేయు నిన్నూ ఱు మున్నూ ఱుఁ
గలవు వత్సరములు, కాన నెందు
బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధునిఁ
జచ్చిపోయి మగుడ వచ్చువాని. ౭.

క. ఒకటిగలదు, వత్తురు వే
ఱొకగర్భంబునను బుట్ట, నుక్తి నిజమొ, న

క్కకు నేటిబుద్ధి, పీనుఁగు
నను బ్రదుకఁగలుగు, నిట్టి నవ్వులు గలవే. ౮.

సీ. అనవుడు, వెసలేచి యాబిడ్డ వైచి పో
యెడువారలకు నడ్డపడుచు నక్క,
వినుఁడు, రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే
మృతుఁడైన భూసురసుతుని మగుడ,
సృంజయుకొడుకు నచ్చిన, నారదుఁడు ప్రభా
వంబునఁ గ్రమ్మఱ వానిఁ దేఁడె,
యట్టుల యొకసిద్ధుఁ డమరుండు మీయెడ్డ
లాలించి దయ బాలు నసువు లొసఁగ
నేని మేలుగాదె, యిదియేల పోయెద,
రనిన వారు మగిడి యరుగుదెంచి
బిడ్డఁ జుట్టుముట్టి పిల్లుగా నేడ్చిరి
పనవి పనవి, యంత నినుఁడు గ్రుంకె. ౯.

వ. * * * ప్రీతవనవిహారనిరతుండగు శంకరుండు కరు
ణారసపూరవశంకరుం డగుట నప్పుడు.

గీ. అట్టు పనవి యేడ్చు నజ్జనంబులకుఁ బ్ర
త్యక్షమై వరంబు లడుగుఁ డనిన,
సంప్రమోదభక్తిసంభ్రమభరితులై
చక్క నవని సాగి మ్రొక్కి వారు. ౧౦.

క. బాలమరణశోకంబునఁ
దేలక యుండంగఁ గావు, దేవోత్తమ, నీ
వాలించిన బ్రదికితిమి, ద
యాళుహృదయ, పార్వతీప్రియా, చంద్రధరా. ౧౧.

వ. అనుచు లేచి నిలుచుటయు శివుం డాశిశువు ప్రాణంబులో
సంగి * * * యంతర్హితుండయ్యె.

భారతము.

దైవ పౌరుషములు.

క. క్షేత్రంబు పురుషకారము,
ధాత్రీశ్వర, బీజ మరయ దైవము, రెండున్
సూత్రపడఁ గూడెనేనియుఁ
బాత్రమగుం గర్మకరుఁడు ఫలమున కెందున్. ౧.

క. విను, పురుషుఁడు గావింపని
పనులకు దైవ మదియెట్లు ఫలమొనరించున్,
జనములు కార్యము నడపఁగ
ననుకూలత నిచ్చు,గాక యయ్యెఫలముల్. ౨.

గీ. పౌరుషంబు దైవంబు తోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర,
విత్తు సహకారి గాకున్న రిత్త నేల
వంధ్యమగుఁగాక తా ఫలవంతమగునె. 3.

గీ. మేలు రెండులోకంబుల మేల తెచ్చుఁ,
గీడు చేసినఁ దప్పదు కీడెయగుట,
గానఁ బుణ్యావర్తనమున కానుకూల్య
శీలమవు దైవ మది ఫలసిద్ధిఁ జేయు. ౪.

క. అనలం బించుకయైనఁ బ
వనుచే వెలుఁగొందుమాడ్కి వర్ధనముం బొం

దును సత్కార్యాచరణం
బును దైవము నానుకూల్యమునఁ, గురుముఖ్యా. ౫.

* * * * * *

క. విను, పౌరుషమును దైవము
నన రెండును గార్యఫలము నందింపఁగ నె
ట్టనఁ గారణములు, గావున,
జననాయక, సదృశములు విచారింపంగన్. ౬.

భారతము.

సక్తుప్రస్థ చరిత్రము.

సీ. వినుఁడు, ధర్మక్షేత్రమన రూఢమైన కు
రుక్షేత్రమునయందు రోషకామ
విరహితుం డొక మహాద్విజుఁ డుంఛవృత్తిమై
నుండు, భార్యయుఁ దనయుండు సతని
పత్నియు సహచరభావంబు నొంది వ
ర్తింతు, రట్టులు తపశ్శ్రీ వెలుంగ
నున్నెడ బలుపంటలన్నియు నత్యంత
వికలంబుగా ననావృష్టిదోష
మానవహిల్లిన, నతని కాహార మొనరఁ
జేసికొనుటకుఁ గఠినమై చెల్లుచుండఁ,
దారునలువురుఁ జని తృణధాన్య మల్ప
మేఱికొనివత్తు, రాఁకలి దీఱకుండ. ౧.

వ. అట్టియెడ నొక్కనాఁ డయ్యందఱును రేపు దొడంగి పడ
మటిజామునకు వెదకి తెచ్చిన పూరికొలుచు ప్రస్థమాత్రం

బు సక్తువయ్యెం, గర్తవ్యానుష్ఠానంబులు నడపి యనంతరం
బ యాఁకుంచెడు పేలపిండియుఁ జెఱిమానెఁడు నానలువురు
సమంబుగాఁ బంచికొని యుపయోగించువారై యున్నస
మయంబున.

గీ. అతిథి యొక్కఁ ధరామరుం డరుగుదెంచెఁ,
గని ప్రియంబున వా రెదుర్కొని సభక్తి
కముగఁ బర్ణశాలాభ్యంతరమున కతనిఁ
దోడికొనిపోయి యాసనస్థునిగఁ జేసి. ౨.

చ. అడుగులు గడ్గి ప్రీతి యొస
లారఁగఁ దద్దయు నెమ్మిఁ బల్కె, ర
ప్పుడు మది పల్లవింప ముని
పుంగవుఁ డాతని కాత్మభాగ మె
క్కుడగు వినీతిఁ జూపి, బుధ
కుంజర, నిర్ధరితార్జనంబునం
బడసిన యట్టి సక్తువు, కృ
పారతి నాఁకలి దీనఁ దీర్పవే. 3.

వ. అని పలికి సమర్పణంబు చేసిన నమ్మహీసురోత్తముం డాస
క్తు వుపయోగించె. దాన నతఁడు తృప్తింబొందకునికి యు
మ్ముని కనుంగొని, యేమిట నితండు తృప్తుండగు, నెట్లు సేయు
దు నెక్కో, యను విచారంబు వొడమ, డోలాయమానమా
నసుండయ్యెం, దదీయభార్య తదింగితం బూహించి యతని
తోడ.

క. నాపాలి సక్తు విచ్చెద
నీపురుషునిఁ దృప్తిఁ జేయుమీ, యనిన నతం

డాపాలఁతి డప్పియును సం
దీపితజఠరాగ్ని యైన తెఱఁగును గనుచున్. ౪.

వ. ఇట్లనియె.

క. మృగములుఁ బక్షులు లోనుగ
దగునాహారములు దెచ్చి తమప్రియులకు నిం
పుగ నిచ్చు, నాకుఁ గొనఁగాఁ
దగునె భవద్భోజ్యమయిన ద్రవ్యము, సాధ్వీ. ౫.

క. స్త్రీ సంతోషించు తెఱం
గాసపడని మనసు గలుగునట్టియథముఁ డీ
చోఁ సడిగనుఁ, జని యచ్చో
గాసింబడు జమునిభటులు కాఱియవెట్టన్. ౬.

వ. అనిన విని యవ్వనిత యతనివదనంబునంజూడ్కి నిలిపి.

గీ. పతియ చుట్టంబుఁ బక్కంబుఁ, బతియ చెలియుఁ,
బతియ తల్లియుఁ దండ్రియుఁ, బతియ గురువుఁ,
బతియ దైవంబు, గావున నతని పని యొ
నర్చుటయచూవె ధర్మంబు నాతికరయ. ౭.

వ. అట్లుంగాక.

క. మాసితగుణా, నీ వాఁకటి
తో నుండఁగ నేటిపాలు, దోషంబిది, యి
ట్లే నాహారము గొందునె,
యీనిర్మలమతికి దీని ని మ్ముచితవిధిన్. ౮.

చ. అని తనసక్తు విచ్చినఁ, బ్రి.
యమ్మున నమ్ముని యమ్మహాద్విజుం
గనుఁగొని, డప్పివో దిదియుఁ

గ్రైకొను, మన్ననతండు ప్రీతి నె
క్కొన భుజియించు, వెండియును
గూర దత్తృప్తి, తదంతరంగమున్
గనుఁగొని యత్తపస్విపతి
క్రమ్మఱ నెమ్మదిఁ జింత నొందినన్. ౯.

వ. తదీయతనయుండు తద్దశావిశేషం బెఱింగి.

సీ. తనపాలి సక్తువు తండ్రికిఁ జూపి, యీ
యతిథిఁ దృప్తునిఁ జేయు మనఘ, దీనఁ,
దనయుండు తండ్రి చిత్తమున నెక్కొనిన కృ
త్యం బాచరించుట యగ్ర్యధర్మ,
మన విని యమ్మహాముని, యెంతప్రియఁబు
చనినను, విను, జనకునకు సుతుఁడు
బాలుండ, యాఁకలి బాలుర కగ్గల,
మట్లుగావున నిది యనుచితఁబు;
నావుడును, దాన పుత్త్రుఁడనంగ వెందు,
నన్నుఁ గాంచుట యరయంగ నిన్నుఁ గాచి
కొనుట, కిప్పిండి యిమ్మహాత్మునకు నిచ్చి
కావవే నన్నుఁ, గారుణ్యభావితాత్మ. ౧౦.

వ. అనినం గొడుకుమాటలకు నమ్మహితాత్ముండు ప్రీతాత్ముండై యాసక్తు వాయతిథి కిచ్చినం బుచ్చికొని యతం డుపయోగించె, దానను నాఁకలివోని తెఱంగు దోఁచిన నయ్యాంచితవ్రతుని డెందంబు గుందు నొందినం, గోడలు తదాకారప్రకారంబు గని తన యంశంబయిన పిండి మామముందరకుం దెచ్చి.

సీ. ఇదియును నతిథికి నిం,డన్న, నక్కట,
యాఁకటఁ దలఁకి నీయంగకములు
శిథిలంబులైనవి, చేడ్పడియున్నది
చిత్తంబు, దీనిఁ బుచ్చికొని నిన్ను
డప్పితో నుండఁగ నెప్పాటఁ జూడఁగ
లాఁడనే, ననుడు, నాలలన, మీరు
మద్గురుగురులఁకు, మహితశుశ్రూషకుఁ
గాదె ప్రాణములు నంగములు కలిమి,
విహిత మీచేఁత నా, కనువృత్తిలీలఁ
గాఁగ జేయుఁడు నన్ను మీకరుణ యలర,
ననిన, సంయమివరుఁ డియ్యకొని యతనికి
నచ్చెలువపాలి సక్తువు నర్థినిచ్చె. ౧౧.

ఉ. ఇచ్చిన బ్రీతిఁ బుచ్చికొని
యింపెసలార భుజించి తృప్తిమై
నచ్చుపడంగ మెచ్చున ము
ఖాంబురుహం బలరంగ నిట్లనుం
బొచ్చెము లేక యయ్యతిథి,
భూరిగుణోత్తర, నిన్నుఁ జూడఁగా
వచ్చితి నేను ధర్ముఁడ, భ
వద్వ్రతశీలతఁ జూచి మెచ్చితిన్. ౧౨.

క. భక్తియు వినయము శ్రద్ధా
యుక్తియునుం దాల్మితోడి యొప్పును గరుణా
సక్తియు నతిథులయెడ నను

రక్తియు నీయందు సుస్థిరత్వముఁ బొందెన్. ౧౩.

* * * * * *

గీ. క్షుధ హరించుఁ బ్రజ్ఞాపరిశోధనములఁ,
దృష్ణ గుదియించుఁ గృప, నీవు తెలిసి వాని,
ననఘ, నిర్జించి తాలుబిడ్డవక యతిథి
పూజనం బిటు సలిపిన పుణ్యమునను. ౧౪.

* * * * * *

చ. వినుము, ప్రభూతదానములు
విస్రుతయజ్ఞములు స్వధర్మతా
వినుతికి నెక్కఁజాలవు, వి
వేకనిధీ, పరిశుద్ధశోభితా
ర్జనమునఁ దెచ్చికొన్న దివ
రంబగు పాత్రము సర్వకాలముం
గని లఘువస్తువేని నొసఁ
గం, గడు నుజ్జ్వలధర్మమారయన్. ౧౫.

క. అనిపలుకుచు దివ్యంబగు
తన యాకారంబు సూపె ధర్ముండు, కన
త్కనకమణిమయవిమానము
వినువీథిం దోఁచె మునులు విస్మయమందన్. ౧౬.

వ. అప్పుడు సక్తుప్రస్థుండు పరమప్రీతిందానును దనవారును ధ
ర్మదేవతకు దండప్రణామంబుచేసి నిలిచిన.

గీ. ధర్మదేవత యతనితో, ధర్మనిరత,
కంటె బ్రహ్మపుత్తెంచిన ఘనవిమాన,

మనఁగ, నది భూమి కవతరించినఁ, బ్రమోద
మెసఁగ, నాధర్మజుఁ డాతని కిట్లులనియె. ౧౭.

క. వేఁడుక నాలుం గొడుకును
గోడలు నీవును, బ్రభూతగుణ, యెక్కుఁడు సం
క్రీడ మెయి నీవిమానము,
నీడితగతి బ్రహ్మసభకు నేగఁగవలయున్. ౧౮.

(అనవుడు సక్తుప్రస్థుఁడు తనవారును దాను నెక్కి ధర్ముం డనుపం జనియెను.)

భారతము.

## రంతిదేవుని చరిత్రము.

సీ. రాజవంశోత్తమ రంతిదేవునికీర్తి
యేల చెప్పఁగఁబడు నిందు నందు;
నారాజు దన సంచితార్థంబులన్నియు
నెడపక దీనుల కిచ్చియిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుఁడై పేద
యై కూఁడు నీరు లేకథమవృత్తి
నెందేని నలువది యెనిమిది దివసము
ల్చరియింప, నొక దివసంబు రేపు
నేయి పాయసంబు నీళ్లును గలిగిన,
బహుకుటుంబభార భయముతోడ
నలసి నీరువట్టు నాకలియును మిక్కి
లొదవఁ జూచి కుడువ నుత్సహించి. ౧.

వ. అయ్యవసరంబున.

సీ. అతిథి భూసురుఁ డొక్కఁ డాహార మడిగినఁ
గడపక ప్రియముతో గారవించి
'హరిసమర్పణ' మంచు నన్నంబులో సగ
మిచ్చిన భుజియించి యేగ నాతఁ,
డంతలో నొకశూద్రుఁ డశనార్థియై వచ్చి
పొడసూప, లేదని పోక, తనకు
నున్న యన్నములోన నొకభాగ మిచ్చిన,
సంతుష్టుఁడై వాఁడు చనిన వెనుకఁ,
గుక్కగమియుఁ దాను నొక్కఁ డేతేర, నా
యన్న శేష మిచ్చె సన్నయమున,
వాని మ్రొక్కి పంప, వరుసతోఁ జండాలుఁ
డొక్కఁ డరుగుదెంచి చక్క నిలిచి. ౨.

క. హీనుఁడఁ, జండాలుండను,
మానవకులనాథ, దప్పి మానదు, నవలం
బోనేర, నీకుఁ జిక్కిన
పానీయము నాకుఁ బోసి బ్రతికింపఁగదే. 3.

వ. అనిన దీనాలాపంబులకుఁ గరుణించి రా జిట్లనియె.

ఉ. అన్నము లేదు, కొద్ది మధు
రాంబువు మాత్రము త్రావవన్న, రా
వన్న, శరీరధారులకు
నాపద వచ్చిన, వారియాపదల్
గ్రన్నన తాల్చి వారికి సు
ఖంబులు సేయుటకంటె నొండు మే

లున్నదె, నాకు దిక్కు పుర
షోత్తముఁ డొక్కఁడుసుమ్ము, పుల్కసా. ౪.

వ. అనిపలికి.

మ. బలనంతంబగు నీరునట్టిన నిజ
ప్రాణాంత మై యున్నచో
నలయండేమియు, వీనిహృజ్జ్వరము నా
రాటంబు ఖేదంబు నా
జలదానంబున నేఁడు మాను ననుచు,
న్సర్వేశ్వరాధీనుఁడై
జలము ల్పోసెను రంతిదేవుఁడు దయం
జండాలపాత్రింబునన్. ౫.

వ. తదనంతరంబున బ్రహ్మాదిదేవతలు సంతోషించి రంతిదేవు
నికి మేలుసేయందలంచి నిజాకారంబులతో ముందట నిలు
వంబడి యారాజు ధైర్యపరీక్షార్థంబు తమరుసేసినవృషలా
దిరూపంబులగు విష్ణుమాయల నెఱింగించిన, నానరేంద్రుం
డందఱికి నమస్కరించి.

క. వారల నేమియు నడుగక
నారాయణభక్తి తనమనంబున వెలుఁగన్
ధీరుఁ డాతఁడు మాయా
పారజ్ఞుం డగుచుఁ బరమపదముం బొందెన్ ౬.

భాగవతము.

## ఓర్పు.

క. అనుపమనియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు చే
సినవారికంటె నక్రో
ధనుఁడు కరం బధికుఁడండ్రు తత్త్వవిధిజ్ఞుల్. ౧.

క. అలిగిన నలుగక, యెగ్గులు
వలికిన మఱి వినవియట్లు ప్రతివచనంబుల్
వలుకక, బన్నమువడి యెదఁ
దలఁపక, యున్నతఁడెచూవె ధర్మజ్ఞుఁ డిలన్. ౨.

క. క్షమగలవానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయసంసిద్ధియగున్,
క్షమియైన వాని భుజవి
క్రమము కడు న్వెలయు సర్వకార్యక్షమమై. ౩.

భారతము.

గీ. క్షమయ జనుల కాభరణము, క్షమయ కీర్తి,
క్షమయ ధర్మంబు, క్షమయ సజ్జనగుణంబు,
క్షమయ యజ్ఞంబు, క్షమయ మోక్షంబు, క్షమయ
సకలదానంబు, క్షమయందె జగము నిల్చు. ౪.

భాస్కరరామాయణము.

## ధర్మరాజు జూదము.

క. బలవంతము జూదమునకుఁ
బిలువంబడి మగుడనగునె పెద్దల, కని తా

నలఘుఁడు ధృతరాష్ట్రజుతోఁ
నలయక ధర్మజుఁడు జూదమాడఁ గడంగెన్. ౧.

* * * * * *

గీ. అభిమతాక్షము ల్ద్రాల్చి మాయావిదుండు
సుబల రాజాత్మజుఁడు ధర్మసుతు జయించె,
నోడుదునె నీకు, నని వెండియును గడంగి
శకునితోఁ జూద మాడె నాశశికులుండు. ౨.

వ. ఇట్లు యుధిష్ఠిరుఁడు బద్ధమత్సరుండై పెఱిగి యొడ్డుచు (ధన కనక వస్తువాహన దాసీదాసాదుల) * * * నొక్కొక్క యొడ్డున నొడ్డి యోటువడిన (ంత) * * * శకుని ధర్మ నందనున కిట్లనియె.

ఉ. ఎల్ల ధనంబు నోటువడి,
తిందుకులేశ్వర, యింక నొడ్డఁగా
మొల్లము నాకుఁ జూపు, మని,
ముందట సారెలు త్రోచి, యాడఁగా
నొల్లకయున్న సౌబలుని,
కున్నత చిత్తుఁడు ధారుణీతలం
బెల్లను నొడ్డి యోటువడి
యెన్ బలవద్వ్యసనాభిభూతుఁడై. 3.

* * * * * *

సీ. తమ్ముల నత్యంతధర్మసమేతుల
నాయతబాహుల నాజిజయుల
నాదిత్యతేజుల నావిభూపాలక
చరితుల నభిమానసత్వరతుల

సహదేవ నకుల వాసవసుత భీములఁ
గ్రమమున నలువురఁ గొఱవేందు్రఁ
డొక్కొక్క యొడ్డున నొడ్డి తన్ను నొడ్డి
యుక్కివంబునఁ దన్ను నోటువడిన,
నతనిఁజూచి శకుని యనియె, నిక్లెల ని
న్నొడ్డి, తథిప, నీకు నొండుధనము
గలదు, మఱచితెట్లు, కమలాక్షి ద్రౌపది
కన్య నీకు ధనముగాదె, యనిన. ౪.

చ. అలయక వెండియుం గడఁగి
యక్షరతుండయి ద్రౌపదిన్మహో
త్పల దళ చారునేత్రిఁ గుల
భామఁ బణంబుగఁ జేసి యొడ్డి సౌ
బలఖలుచేత నోటువడి
పాండుసుతుం డుడిగెన్ ధనంబు ల
గ్గలముగ నొడ్డ లేమి గత
గర్వమునం గడు దీనవక్త్రుఁడై. ౫.

భారతము.

## నాళీజంఘుని చరిత్రము.

చ. విను, మొక బ్రాహ్మణుండు కుల
వృత్తములెల్లఁ దొఱంగి, బోయదా
నినొక తె నాలిఁ జేసికొని,
నెమ్మిఁ గిరాతులఁగూడి, వేఁటకుం

జనుఁ, దిను మాంస, మద్దురిత
  సక్తుఁడు భోగపరుండు గావునన్
ధనము ఘటింపఁగాఁ దగు వి
  ధంబని చూచి వణిగ్జనంబుతోన్. ౧.

వ. చెలిమి సేసి, కొందఱు కోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబునకుం జనఁ, దానును వారితోడం గూడి పోవఁబోవ, గిరిగహనదుర్గమ స్థలంబున నొక్క వనగజంబు

గీ. సాతులోనికుటికి జనముల నున్మద
లీల నేలఁ బెట్టి కాలఁ జమరఁ
జొచ్చుటయును, భీతి విచ్చి నల్దిక్కులఁ
బఱచి రెల్లవారుఁ బటురయమున. ౨.

క. ఆయనయుఁ గాండిశీకుం
డై యుత్తరదిక్కు వాఱె నతిదూరముగా,
నాయెడ నొకమార్గముఁ గని
పోయెను, దా నట్లపోవఁ బోవం గెలనన్. 3.

గీ. పొదల తఱచున జొంపమై పొడవుపఱపు
గలిగి వటువ్రతతనమునఁ జెలువుమిగిలి
యున్న వట భూరుహముఁగని, యుల్ల మచట
నిలువఁగోరిన, నామ్రాని నీడఁ జేరి. ౪.

క. వనలతల కుసుమగంధము
గొని సుడివడు చల్లగాడ్పు కొండొకవీవం,
దనుపార నచటఁ గూర్చుం
డె నతం, డట్లుండ నచ్చటికి లలితగతిన్. ౫.

వ. ఒక్క మహాబకంబు వచ్చె, నది పద్మసంభవునకుం బ్రసాద
పాత్రంబగుచు నాళీజంఘుండను రాజధర్ముండు నను పేళ్లం
బరఁగు, నాకొక్కెరకు నమ్మఱ్ఱి నివాసంబై యుండు, నప్ప
క్షి యిట్లేతెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొను
చూడ్కి నాదరించి,

క. ఎందుండి యేమిపనికై
ఎందుల కేగెదవు, భూసురేశ్వర, ప్రీతిం
బొందితి నినుఁగని, తగియెడు
విందవయితి, నాకు నీదువిధముం జెపుమా. ౬.

వ. అని యడిగిన, నతం, డేను మధ్యదేశీయుండ, గౌతముండ
ను మహనీయచరిత్రుని పుత్త్రుండ, నాలస్యంబున వేదాధ్య
యనాది విప్రకర్మవిరహితుండనై కామలోలత్వంబున బో
యత యిల్లాలుగా బోయలంగలసియుండి పేదఱికంబునకు
నలసి బేహారులవెంట నొక్కసాతుంగూడి పరదేశంబున క
రుగుచోట గిరిగహన దుర్గమప్రదేశంబున.

క. వనకరి యొక్కటి యాసా
తునకుఁ గవిసి జనచయంబుఁ ద్రుంపఁ గడఁగుడున్,
విను, మెల్లవారునుం గను
కనిఁబఱచిరి, భీతి నేను గాననభూమిన్. ౭.

గీ. పఱచి దిక్కుదప్పి భాగ్యంబు కల్మి నీ
దైన నిలయమునకు నరుగుదేరఁ
గంటి ననిన, మేలుగాక, నీ దారిద్ర్య
మపనయింతుఁ, జింత నపనయింపు. ౮.

వ. అంతకు నాతిథ్యంబు గొను, మని రుచిమంతంబులగు మం
దాకినీ మీనంబులు నుపక్వంబులు చేసి మధురంబులగు వ
న్యఫలంబులు దెచ్చి తృప్తియగునట్లుగా నతనికి నాహారవిధి
యొనర్చి రాత్రియగుటయుం బల్లవపుష్పసాంద్రంబగు శయ
నంబు గల్పించి యబ్బకపతి యద్ధరణీసురునితో సముచిత
సంలాపంబుల సుఖనిద్ర చేసి యారాత్రి గడపి, వేగుటయు న
వ్విప్రు నాలోకించి.

క. విను మిత్రుండును రజతముఁ
గనకము బుద్ధియును నాల్గు కారణములు మ
ర్త్యుని దారిద్ర్యము వాయుట,
కని దేవగురుండు సెప్పె, నన్నిటిలోనన్. ౯.

క. మిత్త్రుం డెక్కుడు, కాశ్యప
పుత్త్రుఁడనగు నీకు నేను, భూసురవర, స
న్మైత్త్రియనుష్ఠించెదనఁట,
పాత్త్రముగాకుండుదే యపారశ్రీకిన్. ౧౦.

గీ. నాసఖుండు విరూపాక్ష నామధేయుఁ,
డతనిపురము మధువ్రజ, మదియు మూఁడు
యోజనము లిచ్చటికి, దాని యున్న తెరువు
పట్టి వేచని యాదైత్య భర్తఁ గనుము. ౧౧.

క. కాంచి యతనితో, నేఁ బు
త్తెంచితి, నని చెప్పు, మతఁ డతిప్రీతుండై
కాంచనములు రత్నంబులు
నంచితుగాఁ జేసి యిచ్చు నప్పుడనీకున్, ౧౨.

క. అని యప్పురి దెసచెప్పినఁ,
జని యూతం డతనిఁ గాంచి సముచితభ
న్వినిపించె, రాజధర్మ్మన
కనుఁగులకును సఖుఁడ, ననియు, నతని పనుపునన్. ౧౩.

గీ. అరుగు దెంచితి, ననియు, ధనార్థి ననియు,
నిట్లు వినిపించుటయు రాక్షసేశ్వరుండు
తేఱికొనఁజూచి, యాత్మ, నిప్పాఱుఁ డధముఁ
డగుట దోఁచుచున్నది యడుగవలయు. ౧౪.

వ. అని తలంచి.

క. కులమును విద్యయు వృత్తముఁ
గలయా పెఱఁగింపు, మనినఁ, గలఁగక తన్నుం
దెలియంగఁజెప్ప విప్రుం
డలఘుండగు నసురపతికి నవికృతుఁడగుచున్. ౧౫.

క. ఇతఁ డెట్టిఁడైన నేమగు,
నతనికిసఖుఁ, డట్టి బక మహాత్తర సఖ్యం
బితనిం బౌత్రిము సేయుదె,
యితనికిఁ దృప్తి యగునట్టు లిత్తు ధనంబుల్. ౧౬.

వ. అని నిశ్చయించి యతనికి నాహార సంభారంబులు సమీచీనం
బులుగా నిర్వర్తింపఁ దగువారి నియోగించి మఱునాఁడు.**

క. మహనీయబహుళపూజా
సహితంబుగ భోజనంబు సంప్రీతిగ న
మ్మహితాత్ముఁడు నడపెను, దు
ర్వహభారముగాఁగఁ గనకరాశియు మణులున్. ౨౦.

చ. కుడిచినపల్లెరంబును న
కుంఠిత హర్షముతోడ నిచ్చినం
గడుముదమంది యెత్తుకొని
గాఢభరంబున కౌర్చి మోవఁగా
మెడయును వీఁపు మూఁపులును
మిక్కిలి నొవ్వఁగఁ గొంకుపోవ, నె
క్కుడు వెస నేగుదెంచెఁ గని
కొక్కెర సమ్మదమంద మత్రికిన్. ౧౮.

గీ. అట్లు సంతోషమునఁ దేలి యతనిడప్పి
వోవ బకవల్లభుఁడు పక్షపుటయుగమున
నల్ల వీచి యాహారసమర్పణంబు
చేసి నిసియైన సుఖనిద్ర సేయుచుండు. ౧౯.

వ. ఆదుర్బ్రాహ్మణుండు తనకు రేపటిపయనంబునకు నాహారం
బు చింతించి, యిమ్మహాబకంబు శరీరంబు క్రొవ్వియున్నది.
దీనియందు మాంసంబు చాలంగల, దది యేమఱి నిద్రిపో
వుడుఁ జావనడిచి చెందుకొనిపోయెదంగాక, యని పాప నిశ్చ
యుండయి, చీర చక్కఁ గట్టుకొని, యొక్క కాష్ఠంబు క
రయుగంబునం జక్క నమర్చికొని.

క. అందంద మెడయుఁ దలయు న
మందాటోపమునఁ బెక్కుమాఱు లడిచి, చా
వుం దెలియఁ జూచి, యల రెడు
డెందముతో నీఁకలన్నిటిని వెస నూడ్చెన్. ౨౦.

గీ. ఊడ్చి బొంతువు ద్రవ్వి మే నురివి నంజు
డంతయును బుచ్చి పొదుకగా నమరఁ గట్టి

కొనుచు వేగుఁబోకగుటయుఁ జనియె, నట్టి
సమయమున మేలుకని దనుజప్రభుండు. ౨౧.

క. పొల వలచె, నేమి కీడొకో
కలిగెడు, ననితలఁచి మనసు గలఁగఁగఁ దనవా
రలతోడ నుగ్గడించుచుఁ
జలియించుచు నుండఁ, బొ్రద్దు జామెక్కుటయున్. ౨౨.

వ. రాజధర్మునిం దలంచి.

ఉ. నిచ్చలు వచ్చు రేపకడ
నెయ్యమెలర్పఁగ మత్స్యఖండము, నేఁ
డిచ్చటికేలరాఁడు, గుణ
హీనత విప్రునియందుఁ గల్మినా
యిచ్చఁ దలంచితిం, దులువ
యేమితలంచెనొ, యక్కటా, మదిం
బొచ్చెములేదు, నమ్మ, బక
పుంగవుఁ డెట్లగునొక్కొ, దైవమా. ౨౩.

క. అని దూఱి వగచి యారయఁ
బనిచెం బనిగఱపి భటులఁ బలువుర, వారుం
జని బకముఁ డొక్కయేర్పడఁ
గని యతనికిఁ జెప్పఁబుచ్చి కడువేగమునన్. ౨౪.

వ. అవ్విప్రునిఁ జొప్పువట్టి.

చ. పరిమెయిఁ బాఱి వానిఁగని
పట్టి వెసం బెడకేలుగట్టి తె
చ్చి, రసురభర్తఁ జూచి, యిటు
చేరఁగఁ దేవల దీకృతఘ్నునిం

బోరిగొని వే తినుం, డనినఁ,
  బోకడమాలినవారమయ్య యి
ద్దురితశరీరముం దినఁగ?
  దోసము మా, కని వార లొల్లమిన్. ౨౫.

వ. అతండు.

క. తినుఁడు, తినకుండుఁ, డేమై
నను జేయుఁడు, వీని నేల నాముందరకుం
గొనివచ్చితి, రని పలికిన,
దనుజులు పురివెడలఁ దెచ్చి తద్గాత్రంబున్. ౨౬.

క. వెడకండ నెత్తు రొలుకం
బడఁద్రోసిన, వచ్చి కుక్క పదువు వెనుకకుం
జడిసెఁ గబళింప నొల్లక
కడుపులు నకనకపడంగఁ, గారవముఖ్యా. ౨౭.

* * * * * *

వ. అంత నమరపతికడకు సురపతి వచ్చిన.)

క. కనియతఁడు సంభ్రమంబును
వినయంబును బెరయ గారవించి యడిగె నా
తని, రాజధర్మ నీవే,
యని దైన్యముదోఁప వగచి యశ్రులు దొరఁగన్. ౨౮.

వ. అట్లడిగిన, నమరవిభుండు నీసఖుండు చతుర్ముఖునకు సఖుం
డగుట * * నద్దేవుని మహానుభావంబున * * నెప్ప
టియట్ల యొప్పెడునాకారంబుతో నరుగుదెంచుచున్నవాఁ
డు. * * *

క. అని చెప్పి, వంత బకపతి
చను దెంచెను దనుజపతికి సంతసమెసఁగన్,
మును వాసవుఁడజువాక్యము
నన పాశనిబద్ధుఁ జేసినాఁ • డవ్విప్రున్. ౨౯.

క. ఆనాళీజంఘుండును
దాని నెఱిఁగి భూసురునకుఁ దనకతమున న
ద్దీనదశ యగుట కోర్వక
వాని విడుపుగోరి వేఁడె వరముగ నింద్రున్. ౩౦.

చ. అతఁడును దివ్యబోధమున
నాసమయంబున బ్రహ్మసత్కృపా
న్వితుఁడగు టేర్పడంగని వి
నీతతముండగు రాజధర్మ వాం
ఛిత మొనరించె; విప్రునకుఁ
జేర్చిరి తెచ్చినవారు తద్ధన
ప్రతతియు దైత్యనాయకుఁడు
పన్ప బకాధిపుఁ బ్రస్తుతించుచున్. ౩౧.

వ. అవ్విప్రుండు ధనసంచయంబు మోచుకొని మరలి మరలి చూచుచు నంభ్రమంబునంబోయె. * * *

క. అని చెప్పి తాత యిట్లను
మనుమనితో నాదరమున మఱియును, బ్రహ్మ
ఘ్నునకును నిష్కృతి గలుగును,
వినుము, కృతఘ్నునకు లేదు, విమలచరిత్రా. ౩౨.

క, ఆరయ మిత్రద్రోహము
దారుణమగు పాతకము కృతఘ్నతకంటెన్,

వైరముగొని విడువవలయు
నారెండు తెఱఁగులవారి నాప్తులనైనన్. 33.

క. మిత్రం ద్రోహికములు నా
ముత్రికములునైన భద్రములు దలకొలుపున్,
మిత్రధనంబులలోనను
మిత్రుఁడ యెక్కుడనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్. 34.

క. ఉత్తమకులజుఁడు సుగుణా
యత్తుఁడు సుస్నేహమతియు నగుమిత్రునకుం
జిత్తమెలర్చి తెలంగునఁ
బొత్తుమనఁగవలయు శుభముఁ బొందవలసినన్. 35.

భారతము.

శ్రీరస్తు.

# పద్యరత్నభాండాగారము.

## ద్వితీయపేటి.

### మేధానిధియను మునిసుతుఁడు.

( చిరకారి. )

అతఁడు చిరకాల సువిచా
రితంబుగాఁ జేసి యాచరించుం, గురుభూ
పతివర్య, యెద్దియును, నది
కతమునఁ జిరకారినామకంబున బరఁగున్, ౧.

సీ. విను, మొక్క కారణంబున ముని పత్నిపైఁ
గోపించి, చంప నక్కొడుకుఁ బనిచి,
యెటయేని వెడలిపోవుటయును, బనులెల్ల
జిరవిచారముతోడఁ జేయుఁగాన
నచ్చిరకారి యిట్లని విచారించెఁ, జ
నకుపన్న సేత మానంగ రాదు,

తల్లిఁ జంపుటయును దగదు, తండ్రితలంపు
తప్పింతుఁగా కని తలఁతునేనిఁ
గల్మషం బందు, దాని సత్కర్మవిదులు,
మాతృరక్ష కర్తవ్యమే మాడ్కి నైనఁ,
బుత్రభావ మస్వాతంత్ర్యమునకు నెలవు,
పాప మడఁగింప నెవ్వల నోపునొకో. ౨.

క. జననీవధంబు జేసిన
ననుమానమె నరకమగుట, యని యుడిగితిఁబో
జనకావమాన మొనరిం
చినవానికి నరకమున వసింపఁగవలదే. ౩.

* * * * *

క. జనకుఁడ దేవమైన జన్మం
చినవాఁడను, జనకుపంపు చేసినఁ బాయుం
దనయుని పాపము, లనియే
వినియుందుదుఁ, దలఁపులింక వేయును నేలా. ౪.

క. జనకుఁడు తపమును ధర్మం
బును విద్యయుఁ బరమదైవమును, గావున నా
తనికిఁ బ్రియంబగుపని చే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ జెందుట గల్గున్. ౫.

వ. అని వితర్కించి తల్లి తెగుంగుఁ దలంచి.

చ. కరచరణాదిసంఘటిత
కాయము సంజననంబు, వహ్నిపు
ట్టరణిని బోలెఁ, దల్లి దెస
నైనది గాదొకో! యట్లుగాక, దు

ర్భరమగు గర్భఖేదమును
బట్టికినై నిజదేహచింతపై
భరమొక యింతలేక పడు
పాటులు నక్కట యెక్కుడెంతయున్. ౬.

గీ. వచ్చిపోయి చూచువాఁడుగా కిడుములఁ
బడునె తల్లివోలెఁ బట్టితోడఁ
దండ్రి; సెప్పు నిట్లి ధర్మశాస్త్రంబులు
నంబ గౌరవమున నధికయగుట. ౭.

గీ. బాలుఁడైనఁ గొడుకు ప్రౌఢుఁడైనను వృద్ధు
డైన నొక్కవిధము యర్మిలయును
నరయ భరము తల్లి; కాపదార్థంబు జ
గంబు కలిమికెల్లఁ గారణంబు. ౮.

గీ. క్షుద్రజంతువులకు సురలకు నెమ్మయిఁ
దలఁప నొక్కరూప తల్లివలయు;
నూఁటడిల్లఁగలదె యొండుచోటను సువ
స్తువు నివాసమైనచోటఁ గాక.? ౯.

క. అప్పుడ యసమర్థుండగు,
నప్పుడ దుఃఖియగు, శూన్యమైతోఁచు జగం
బప్పుడ, మాతృవియోగం
బెప్పుడు వాటిల్లు నపుడ యింతయుఁ దూలున్.

క. కలవాఁడు లేనివాఁడు స
బలుఁ డబలుఁడు మూఢబుద్ధి ప్రౌఢుం డనఁగా
వల, దెవ్వరికైన జనని
కలిమియు యత్యంతసౌఖ్యకరమైయుండున్. ౧౧.

గీ. ఇట్టి జనని వధించుట యెల భంగి
నధిక పాపపయోరాశియందు ముంచు,
దీని నెఱుఁగఁడె పసులవాఁడైన, వధకు
నేల తెంపు వాటిలుఁ, జేతులెట్టులాడు. ౧౨.

వ. అని యిట్లు పెక్కుభంగుల నూహించుచుఁ జిరకారియగు
ట నతండు శీఘ్రకారిగాక యుండం, దడ వెంతయేనియుం
గలిగె, నంతకుఁ దదీయజనకుండు.

క. వెడపనికి నాలిఁ జంపం
గొడుకుఁ బనిచి వచ్చినాఁడఁ గ్రూరత్వమునం,
గడవంబడు నొకో పని, యని
కడు వెసఁ జనుదెంచె నశ్రుకణములు దొరఁగన్. ౧౩.

వ. అట్లు చనుదెంచునప్పుడు.

క. చిరకారి యెట్లునుం దన
చిరకారితఁ జూపుఁగాక శీఘ్రపుఁజేఁతం
దురపిల్లఁ జేయునే నను
వెరవరి వాఁడిట్టిపనికి వేగిరపడునే. ౧౪.

వ. అని పుత్త్రునుద్దేశించి.

చ. చిరముగ గర్భవాసమునఁ
జెందితి, పుత్త్ర, చిరంబుగాఁగ ని
న్నరసెఁగదమ్మ తల్లి, యన
యంబును నేఁబనుపంగఁ బూనియుం
జిరముగ నిట్టులిత్తెఱఁగు
చేఁత దలంచితయేని, సత్కృపా

పర, చిరకారినాఁ బరఁగు
భాసితనామము సార్థకంబగున్. ౧౫.

గీ. నాకు నాతపంబునకు నిందరాకుండ,
దురితభయము నిన్నుఁ బొరయకుండ,
నెమ్మిఁజేసి, తన్న, నీచిరకారితో
సకలభూతములును సంస్తుతింప. ౧౬.

వ. అనుచుం జనుదెంచి నివాసంబు ప్రవేశంబుచేసినం, గని చిరకారి కరంబుననున్న వధసాధనంబు డిగ్గవిడిచి యగ్గౌతమ వంశవర్యు చరణంబులు శిరంబు సోఁక దండప్రణామంబు సేసెం, బత్నియు సాఁగిలిమ్రొక్కె, నయ్యిరువుర నెత్తి శోక బాష్పంబు లానందాశ్రువులుగా నమ్మునివరుండు తనయుని గాఢాలింగనంబును మూర్ధాఘ్రాణంబునుం జేసి దీవనలం బొగడ్తల నభినందించి తానును వారును సుఖాసీనులై యుండి మఱియు నిట్లనియె.

క. కార్యవిచారము చిరముగ
ధైర్యముతో నడపవలయుఁ బత్త్రిక్రియులం,
దార్యుఁ డనార్యుఁడు వీఁ, డని
యార్యులు సేయుదురు నిశ్చయంబు చిరముగన్. ౧౭.

క. మిత్త్రత్వము శత్రుత్వముఁ
బాత్రతయు నపాత్రతయును బరికించ్చునుచా
రిత్రుఁడు చిరతరం గనా
సూత్రితముగఁ దానెల్ల శుభములు పొందున్ ౧౮.

భారతము.

## విప్రతాడితశునకము.

వ. (శ్రీరాముడు.)

క. అరుదెంచి నెత్తి నెత్తుటి
వరదలు జొత్తిల్ల నగరి వాకిట వెతతో
నిరువుకొనియున్న శునకముఁ
బరికించి, వచింపు, మేల పఱతెంచి, తనన్. ౧.

ఉ. ఆమృగదంశకంబనియె,
నర్కకులేంద్ర, యలర్కమేమి, యిం
కేమిటి కేగుదెంచినది,
యేటికిఁ, గొట్టుము, నాక, లీల నేఁ
డీమును లీన్నృపాలమణు
లిందఱుఁ గొల్వఁగ, నిందు వచ్చినా,
వేమని నీదయాదికస
మిద్ధగుణంబులు సన్నుతింపుదున్. ౨.

* * * * * * *

చ. నృపతికి సాధురక్షణ వ
హించుట ధర్మము, గాన నాదు వి
న్నప మిఁక నాలకింపు, జన
నాయక, యెవ్వరి కెగ్గు సేయ కే
నెపుడుఁ జరింతు నీపురి, ని
దేమియొ నేఁ డొక భిక్షుకుండు న
న్గుపితమతిన్ శిరం బవియఁ
గొట్టెఁ, బరామరిసింపవే, యనన్. ౩.

ఉ. అక్కరుణాబ్ధి రామవిభుఁ
డప్పుడె భిక్షుకుఁ బిల్వఁబంచి, యి
కుక్కకు నీకు నేమి పగ,
కోపముతోఁ దలవ్రయ్యఁ గొట్టినా,
వక్కట, విప్రవంశజుఁడ
వయ్యు దురాగ్రహ శత్రు గెల్వలే,
వెక్కడి భిక్షుకత్వ మిది,
యేటి విరక్తి, యటంచు దూఱినన్. ౪.

గీ. అతఁడు కరములు మొగిచి యి ట్టనుచుఁ బలికె,
దేవ భిక్షార్థ మింటింటఁ దిరిగి తిరిగి
యలసి నేరాఁగ నిది వీథి నడ్డమగుచుఁ
గదలకున్నను గొట్టితిఁ, గలదు తప్పు. ౫.

క. దండింపఁ దగుదు నేనుం,
దండింపుము నన్ను, నీవు దండించినచో
దండింపఁ డింక మీఁదట
దండి, యనిన, విభుఁడు తగిన దండన యరయన్. ౬.

క. కౌలేయక మి ట్లనియెను,
గాలాంజన మనెడి గిరిని గలదేవళమున్
బాలింప నితనిఁ బనుపుము,
చాలునదియె దండ, మనిన, జనపతి నగుచున్. ౭.

గీ. ఆతని కపుడె తదాధిపత్యం బొసంగి
ప్రభుత నభిషేక మొనరించి భద్రగజము
మీఁద నెక్కించి పంచిన, మేదినీంద్రుఁ
గాంచి మంత్రులు పల్కి రక్కజముగాఁగ. ౮.

ఉ. తప్పొనరించి విప్రుఁడు ము
దంబున దుర్గవిభుత్వమొందె, నం
చిప్పురి నున్న విప్రజను
లెల్లను జేయుదు రింక నిట్టులుం
దప్పులె, యంచుఁ బల్కెఁ బతి
నవ్వుచు నిప్పని కీడొ మంచిదో
చెప్పెడి గుర్కురం, బని వ
చించిన, భైరవు తేజి యిట్లనున్. ౯.

ఉ. ఎంచఁగ నింతకంటెఁ, గల
దే యవమానము, దేవ, తొల్లి నే
నంచితవిప్రవంశజుఁడ
నై యల దేవగృహాధిపత్యము
న్గాంచి తదన్నభుక్తిఁ గొని
కాదె వహించితి నిట్టి జన్మము,
న్గాంచెమె దేవతార్థహృతి
కుక్కతవం బొనరింప కుండునే. ౧౦.

ఉత్తరరామాయణము.

యయాతి తనకొడుకునకు నేర్పిన నీతులు.

క. ఎఱుకగల వారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్. ౧.

క. ఇచ్చునది ధనము పాత్రున,
కచ్చఁగ నెరువేడ కుండునది, యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్. ౨.

క. మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగ బలుకునది ధర్మయుతముగ సభలన్. ౩.

సీ. వదన బాణాసనవ్యక్త ముక్తములైన
పలుకు ల న్గడువాఁడి బాణతతులఁ
బరమర్మలక్ష్యముల్ పాయక భేదించు
చుండెడు దుర్జన యోధవరుల
కడ నుండకున్నది, కరుణ యార్జవ మక్ష
జయము సత్యంబును శమము శౌచ
మనునివి యెద నిల్పునది, శత్రుషడ్వర్గ
జయమందునది శుద్ధశాంతబుద్ధి,
మదము కామంబు క్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోని సహజ
వైరివర్గంబు నొడిచినవాఁడె గెలుచు
నశ్రమంబున వెలుపలి యహిత తతుల. ౪.

శరణాగత రక్షణ.

సీ. పాపాత్ముఁ డోకబోయ పక్షుల వధియించి
తినియును బెక్కమ్మికొనియు నదియె

బ్రదుకఁగా దానికి బహుసాధనంబులు
సవరించుకొని మహాటవిఁ జరింప,
నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి
సకల జీవులకు నాశంబు పుట్టు
నట్టిదియై కాన యంతయు జలమయ
మైన, బెగ్గిలి యన్నరాధముండు
వేగ పఱ్ఱొడ్డి యల్లన వెడలి మిఱుత
నొకవనస్పతి జొంపమై యున్నదానిఁ
జెంది రాతిరి యగుటయు శిలయ సెజ్జ
గాఁగ శీతార్తుఁడై యుండెఁ గారవేంద్ర. ౧.

క. ఆలుబ్ధకుఁ డాతరువర
మాలోకించి కడు భక్తి ననియె, నిచట భూ
తాలిం గొలిచెదఁ గరుణా
శీలత ననుఁగాచుటకు విశిష్టవిసీతిన్. ౨.

వ. అని యి ట్లప్పక్షిధ్వంసకుండు శయనంబుఁ బాటించియుండ
నమ్మహీరుహంబు కోటరంబున నసియించి యుండునది
యొక్క కపోతంబు తన వల్లభ యెటయేని మేతఁకుంబో
యి రాకతడసిన శోకించి. ౩.

సీ. ఎచట నున్నది యొక్కొ యింత ప్రొద్దాక చోట
నుండు నే ననుఁబాసి యుజ్జ్వలాంగి,
యేకారణంబున నే మయ్యెనో వాన
యేపున దెగయఁగా నోవు, నకట,
యమ్మేను లేకున్న నిమ్మేనికలిమి ని
రర్థక, మధికానురాగయుక్త

యగుసతిగుణముల నైహికాముష్మిక
సుఖసాధనంబులు సువ్వె పతికి,
నేమి చేయుదు, మందిర మిపుడు పాడు
వాఱుచున్నది, యనఁగ, నప్పలుకులెల్ల
బోయవలలోన నున్న కపోతి విని మ
నంబు సంతోషపూరమగ్నంబుగాఁగ. ౪.

క. పతిమదికి నింత యెక్కిన
యతివగదా పుణ్యవతి, ప్రియాలాపము లీ
గతి వినఁ గాంచితి, జన్మము
కృతకృత్యంబయ్యె నాకు, గెలిచితి జమునిన్. ౫.

వ. అని యుల్లంబున నుగ్గడించి, పతికిం దన తెఱం గెఱింగించి, విధికృతంబునకు వగవం బనిలే, దని, మఱియు ని ట్లనియె.

చ. శరణము సొచ్చినం దగఁ బ్రి
సన్నత గైకొని రక్షణంబు సా
దరమునఁ జేయ సత్యాధిక
ధర్మముగా బుధకోటి సెప్పు, నీ
వరసి మహాత్ము పీని శర
ణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము, ప్రి
భూతపు సీతునఁ గొంకువోయెడున్. ౬.

క. అని యిట్లేర్పడఁ బలికిన
విని, శోకము డిగ్గవిడిచి, విహగము కరుణం
దనజాతి సెప్పి, తగ ని
ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోన్. ౭.

క. ఓయన్న, డస్సినాఁడవు
మాయింటికి నతిథి వైతి, మసలక నీకుం
జేయవలయు నాతిథ్యం,
బేయది భవదీప్సితార్థ మెఱిఁగింపు తగన్. ౮.

చ. అనవుడు, నుల్ల మెంతయుఁ బ్రి
యంబు వహింపఁగఁ, బక్షివర్య, నీ
తున సకలాంగకంబులుఁ బ్రి
తున్నము లయ్యెడు, దీనిఁ బాపవే,
యనిన, విహంగమంబు రయ
మారఁగ నచ్చటి పుల్ల లెల్ల ము
క్కునఁ గొని వచ్చి ప్రోవిడి య
కుంఠితమైన దయాగుణంబునన్. ౯.

వ. పొంతపల్లియకు రయంబునం జని పుల్లతల సంగతంబయిన యింగలంబు.

క. కొనివచ్చి పుల్ల ప్రోవునఁ
దనుకంగాఁ జేసి నెమ్మి దళుకొత్తఁగ ని
ట్లను బోయతోడ, మే నీ
యనలంబునఁ గాచికొనుట కై తె, మ్మనఘా. ౧౦.

చ. అనువుడు, వాఁడు, గువ్వ హృద
యం బలరం, దనయంగకంబు ల
య్యనలశిఖాకలాపమున
నల్లన నల్లన నీతుగాచి బా
ధన ముడుగంగఁ జేయఁగఁ, బ
దంపడి యాఁకలి చాలఁదోఁచెఁ, దోఁ

చిన నెఱిఁగించె గువ్వ, కది
సేయు నుపాయము లేక యాత్మలోన్. ౧౧.

వ. వగచి వెలవెలంబాఱి తలవంచి వాని కిట్లనియె.

గీ. ఖగములకు జీవనం బనఁగలదె సంగ్ర
హించినట్టిది, యొకటి కేమియైన
మాకు దొరఁకొన్నఁ దిందుముగాక, యైన
నీవు డస్సితి, వాతిథ్యనియతి వలయు. ౧౨.

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము.

క. అనిపలికి యగ్ని వలగొని
తన దేహం బందులోనఁ దడయక యిడినం,
గని బోయ విస్మయంబున
మన మానఁగఁ గొంతసేపు మ్రాన్పడియుండెన్. ౧౩.

వ. పదంపడి.

మ. కలదే యిమ్మయి పౌరుషంబు జగతిం,
గారుణ్య మేపార ని
ప్పులఁ గిట్టిచ్చునె మేను, నాదు చరితం
బిల్లింతకుం బట్టులై
తలఁప న్వచ్చిన నింత కీడగునె, యే
తత్క్రూరతాఘోరచే
ష్టలు మానంగలవాఁడఁ, బక్షి గురువై
సంధించె సద్బోధముల్. ౧౪.

వ. అని యంతరంగంబు వైరాగ్యనిరంతరం బగుటయు నంత
నిలువక.

మ. ఇది యి ట్లాలిని బంధులం దొఱఁగి తా
నీయగ్నిలోఁ గూలె నె
ప్పిదమై యుండఁగ నిట్టి తెంపు వెలయం,
బెంపారు వైరాగ్యసం
పద పాపంబుల నెల్లఁ దున్మఁగ మహా
ప్రస్థానపుణ్యాత్వ మొం
దెద నే నిప్పుడ, యంచు మానసము శాం
తిం బొంద నిర్మోహుఁడై. ౧౫.

క. వలలోన నున్న పులుఁగుల
వెలువడఁగా విడిచి, వలయు వెండియుఁ దనకుం
గల పక్షినిహతిసాధన
ములు నచటనె యుండఁ, బోయె బోయ నియతుఁడై. ౧౬.

గీ. అక్కపోతి, నాథుఁ డగ్నిలోఁ బడుటకు
శోకవహ్నిఁ జిత్తమాకులముగ,
నెలుఁగురాలుపడఁగ, నిట్లని పలవించె
నశ్రుజలతరంగితాస్య యగుచు. ౧౭.

క. నా యాఁకటి కోర్వ వెపుడు,
వేమైనను నేఁ గొనంగ వెండి యనుభవిం,
తా యాసపడుట గనుఁగొని
కూయుదు,. ననుఁబాసి చనుటకుం దగవగు నే. ౧౮.

వ. అని వెండియు.

సీ. ఇగురు జొంపంబుల నింపారు విరులను
బొలుపైన పొదల కేళ్ళివలకుఁ దార్చి

సెలయేఱులందలి తెలినీటఁ దనువు సొం
పెలసిన గిరుల తెప్పలకుఁ జేర్చి,
మావిమోకల నెలదీవలఁ జెన్నొందు
తోటలకడ లలితోడఁ జెంది,
యలరునెత్తమ్ముల కలిమిఁ జెల్వగు డిగ్గి
యల తీరభూముల నల్లఁ బొంది,
నన్ను ముదమునఁ జేరి యానంద మొందఁ
గేలిసలిపెడు నీదగులీల మఱవ
నావశంబె, ప్రాణేశ, ప్రాణంబు లిపుడ
నిన్నుఁ గూర్చి, యే తెంతు నీచన్నకడకు. ౧౯

వ. అట్లుంగాక.

క. తేనియనుమరణమునఁ దన
మేను విడిచినట్టి కాంత మేలిపదవికిం
దాను నతఁడును నరిగి య
నూన స్థిరసుఖము లందుచుండుట విందున్. ౨౦

క. అనిపలికి యప్పు డనలము
ఘనముగ దరికొల్పి మది వికాసముఁ బొందం
దనవల్లభుఁ దలఁచుచు వల
గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. ౨౧

క. స్ఫురితవిమానము మీఁద న
మరతతి వేష్టింప రత్నమయభూషణసుం
దర దివ్యమూర్తి వెలిగెడు
వరునిఁగల (సె) పరమసౌఖ్యవైభవ మొదవన్. ౨౨

భారతము.

## యక్ష ప్రశ్నములు.

వ. యక్షుం డి ట్లనియె.

క. ఏమిట శ్రోత్రియుఁ డనఁ జను,
నేమిటఁ గడు మహిమ వడయు నిమ్మగఁ బురుషుం,
డేమిట సహాయయుతుఁడగు,
నేమిట నగు బుద్ధిమంతుఁ, డేర్పడఁ జెపుమా. ౧.

వ. అవిన (ధర్మరాజు) ఇ ట్లనియె.

క. శ్రుతమువలన శ్రోత్రియుఁడగు,
నతుల తపోయుక్తిఁ గడుమహత్వముఁ బడయున్,
ధృతిచే సహాయయుతుఁ డగు
నతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్. ౨.

వ. అని చెప్పిన నన్నరదేవోత్తమున కప్పురుషుండు వెండియు ని ట్లనియె.

గీ. ఏమికతమున భూదేవుఁ డెసఁగు దేవ
భావమున, నాతనికి సాధుభావ మెవ్వి
ధమున నగు, నసాధుత్వ మెద్దానఁ జెందు,
మానుషుం డగు నాతఁ డేదానఁ జెపుమ. 3.

చ. అనవుడు ధర్మజుం డనియె,
సద్ధ్యయనంబున దేవభావముం
గను నవనీసురుం, డధి
క వ్రతశీలత సాధుభావ మా
తనికి, విశిష్టవృత్తి దిగఁ
ద్రావి యసాధు వనంగ నుండు, శ్రా

చనియతి లేక మృత్యుభయ
సంగతి నాతఁడు మానుషుం డగున్. ౪.

క. నావుడు నతఁ డాతనితో,
జీవన్మృతుఁ డెట్టివాఁడు, చెప్పు మనుటయున్,
దేవాతిథి పితృభృత్యజ
నావళులకు నిడక కుడుచునతఁ, డని చెప్పెన్. ౫.

చ. విను, మగుడంగ వాఁడు పృథి
వీపతిఁ జూచి, ధరిత్రికంటె వ్రేఁ
కనయగుదాని, నాకసము
కంటెఁ గడుం బొడవైన దాని, గా
డ్పునకును నెక్కుడై జవము
పొంపిరి వోయెడు దానిఁ, బూరికం
టెను దఱుచైనదానిని, ఘ
టింపఁగఁ జెప్పుము నాకు, నావుడున్. ౬.

వ. అమ్మనుజోత్తముం డయ్యక్షోత్తమున కిట్లనియె.

గీ. తల్లి వ్రేఁగుసువ్వె ధరణికంటెను, నాక
సంబుకంటెఁ బొడవు జనకుఁ, డరయ
గాడ్పుకంటె మనసు కడుశీఘ్రగతి, తృణో
త్కరముకంటెఁ జింత కరము దఱుచు. ౭.

వ. అనిన నంబరచరుం డతని కిట్లనియె.

గీ. మొనసి నిద్రించియును గన్నుమూయ దెద్ది,
పుట్టియును జేతనత్వంబుఁ బొరయ దెద్ది,
యరయ రూపుగల్గియు హృదయంబు లేని
దెద్ది, వేగంబుకతమున నెద్ది పొదలు. ౮.

గీ. అనినఁ, గన్నుమూయదు సుప్తమయ్యు మీను,
పుట్టియును గుడ్డు చేతనం బొరయకుండు,
హృదయరహితంబు తారూప, మేఱు రయము
కతన వర్తించు, నని చెప్పెఁ గౌరవుండు. ౯.

వ. అని చెప్పిన, నయ్యక్షుఁడతనితోఁ, దెరువునడుచువానికి, రోగార్తునకు, గృహస్థునకు, మృతిఁబొందినవానికి, నెవ్వ రెవ్వరు చుట్టంబు, లనిన, నప్పుడమిఱేఁడు నలువురకుఁ గ్రమంబున సార్థంబును, వైద్యుండును, సద్భార్యయుఁ, గృతంబగు ధర్మంబును, బరమమిత్రు, లని నిర్దేశించుటయు, వెండియు నిట్లనియె.

క. ఎయ్యది ధర్మమునకుఁ గుదు,
రెయ్యది యాశ్రయము కీర్తికి, స్వర్గమార్గం
బెయ్యది సురలోకమునకు,
నెయ్యది సుఖములకు నిక్క, మేర్పడఁ జెపుమా. ౧౦.

వ. అని యడుగుటయు.

క. అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకుఁ గుదురండ్రు, కీర్తి మహిమ నెలవు దా
నము, సత్యము సురపురి మా
ర్గము, శీలము సంశ్రయము సుఖంబుల కెల్లన్. ౧౧

వ. అని యుధిష్ఠిరుం డెఱింగించిన వెండియు.

చ. నరునకు నాత్మ యెవ్వఁడు, ఘ
నంబుగ దైవికమైన చుట్ట మె
వ్వ రతనికిన్, దదీయమగు
వర్తన మేమిట నిర్వహిల్లు, భూ

వర, యతఁ డేమిప్రాని యన
నవ్యతఁ బొందు, నెఱుంగఁజెప్పు మీ
వరుదుగ, నన్న, నక్కఱకు
ఱాగ్రణి యాతనితోడ నిట్లనున్. ౧౨.

గీ. ఆత్మజుఁడు సువ్వె పురుషున కాత్మయయ్యె,
నాతనికి భార్య దైవికమైన చుట్ట,
మతనిజీవిక పర్జన్యకతనఁ జెల్లు,
నతఁడు దానముఁ గొనియాడి యతిశయిల్లు. ౧౩.

చ. అన విని, మేటిధర్మమగు
నట్టిది యెయ్యది, యెట్టి దెప్పుడుం
గనియఁగఁ బండియుండు నెస
కంబుగ, నెయ్యది నిగ్రహించినం
దనరుఁ బ్రమోదసిద్ధి నియ
తంబుగ, నెవ్వరితోడి సాధి యెం
దును వికలంబుగాదు, పరి
తోష మెలర్ప నుపన్యసింపవే. ౧౪.

వ. అని దివ్యుండు వలికిన నాదివ్యబోధనుం డిట్లనియె.

గీ. విను మహింస మేటియనఁజను ధర్మంబు,
యోగకర్మమెపుడు నొనరఁ బండి
యుండు, మనసుక్రొవ్వు ఖండింపఁగా మోద
మొసఁగు, సుజనసంధి యెడలదెందు. ౧౫.

* * * * * *

వ. అని తెలిపిన నయ్యక్షుండు ధర్మనందనుతో మనుజుం డెయ్య

ది పరిత్యజించి సర్వజనప్రియుండును నిశ్శోకుండును నర్థవం
తుండును సుఖియు నగు ననిన నమ్మహీపతి యతని కిట్లనియె.

గీ. సర్వజన సమ్మతుండగు గర్వముడిగి,
క్రోధముడఁచి శోకమునకుఁ గుదురుగాఁడు
వినవె, యర్థాఢ్యుఁడగు లోభ మొనర విడిచి,
తృష్ణ వర్జించి సౌఖ్యము తెరువుఁ గాంచు. ౧౬.

వ. అనిన యనంతరంబ యద్దివ్యుం డతనితోఁ బురుషశబ్దవా
చ్యుం డెట్టివాఁడు, మఱియు సర్వధనియగువాఁ డెవ్వండు,
నిశ్చయింపు,మనినఁ, బాండవజ్యేష్ఠుం డిట్లనియె.

క. దివిముట్టి ధరణి నంతట
నిడివి మెఱయుచుండు నెవ్వనియశోరమ య
ట్టి విశిష్టచరితుఁడు, య
క్షవర, పురుషవాచ్యుఁ డనఁ బ్రకాశత నొందున్. ౧౭.

గీ. ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్యదుః
ఖములు భూతభావి కార్యములును
నెవ్వనికి సమంబు లివి, సర్వధనియనఁ
బరగుఁజువ్వె యట్టిభవ్యుఁ, డనఘ. ౧౮.

భారతము.

దశరథునికిఁగలిగిన మునిశాపము.

సీ. నాపిననాఁ డొకనాఁ డేను నడురేయి
సరయూతటంబునఁ జండచాప
ధరుఁడనై కాపుండి దంతావళక్రోడ
భల్లూక మహిషాది బహుమృగంబు

ఉదకంబు లయ్యేట నొగిఁ ద్రావఁగా వాని
చప్పుడు లక్షించి శబ్దవేధు
లగు సాయకము లేసి యందంద హింసించు
నెడ, నొక్క మహాత్ముఁ డేగుదెంచి
కుండ నీరు ముంప, ఘుమఘుమధ్వని విని
కుంభిని నదబుద్ధిఁ గోలఁ దొడిగి
కడిమి నేయఁ, జిత్త మడలింప వీతెంచె
హా! నమశ్శివాయ యను నెలుంగు.

చ. అదివిని భీతినొంది వెర
గందుచు వెండియు వింటి, నొంటి నీ
నదికడ కేగుదెంచి కఠి
న ప్రదరాహతి నొచ్చితిం గదే,
యిది కడుపాతకం బనక
యెవ్వఁడొకోఁయిటు లేసె, నేగతిన్
వెదకెద రింక నన్ను నతి
వృద్ధులు నంధులునైన మద్గురుల్.

క. విపినంబుల ఫలమూలము
లుపవాసములుండి తినుచు నొగిఁ బితృసేవా
నిపుణత నుండెడి నే నే
యపరాధముఁ జేసినాఁడ నాయుధవృత్తికిన్. 3.

గీ. మునికుమారుఁడైన ముగ్ధు నన్నిటు సేసి
కాంచులాభ మేమిగలుగవలచి
బాణమేసినాఁడు, ప్రాణంబులకు నేను
వగవఁ దల్లిదండ్రు లగతులగుట.

క. కన్నులు లేవను నెవ్వగ
యెన్నఁడు మదిఁ దోఁచకుండ నిమ్ములఁ నేనే
కన్నులమాత్రై యుండితి
నెన్నివిధములందు, నింక నెయ్యది గతియో. ౫.

సీ. జలములు దెమ్మనఁ జనుదెంచి యిచ్చోటఁ
బడితి నే నిష్ఠురబాణనిహతి,
నెఱుఁగరు మద్గురు లీఘోరదురవస్థఁ
దడసె వీఁ డనుభీతిఁ దగిలి నన్ను
నెంత కోపింతురో, యే మని వగతురో,
ధృతి నెట్లు దూలిరో, దిక్కుమాలి,
రింకెవ్వ రుదకంబు లిచ్చెద, రెవ్వారె
ట్లరసెద, రే నిట్టు లైనవార్త
విని నయపుడ ప్రాణంబుల విడువఁగలరు,
ముప్పురముగూడ నీశిలీముఖమునందుఁ
దగిలె, మే మని దైవంబు దెలుపుఁ జెప్ప,
నకట, హా తల్లి, హా తండ్రి, యనుచు నడలె. ౬.

చ. అడలఁగ, నీతఁ డొక్క ముని,
యక్కట, పాపముఁ జేసితిం గదే
తొడిఁబడ బాణమేయుటయుఁ
దూఱఁగ నాటెను, యొప్పు డీతమం
బెడలును, చూడ నయ్యెడను
నెప్పుడు వోదును, నాగ్రఁ, జందుఁ డ
ప్పుడ పొడ దెంచె నామనసు
పోల్కఁ బయోజము లుబ్బఁడంగఁగన్. ౭.

వ. ఏన త్తరంగిణిం దాఁటి తత్తీరంబున.

చ. విరిసిన యజ్జటాభరము
        విన్నని మోము దురంతవేదనం
    బొరల ధరాపరాగమున
        బ్రుంగిన యంగము గల్గి, యమ్మహా
    శర మటు దూఱ, దుస్సహాద
        శం గలశంబున నెత్తిగిల్లి, నె
    త్తురు దొరఁగంగ నాతురతఁ
        దూలుచునున్న మునీంద్రనందనున్. ౮.

క. కనుఁగొని, యుల్లము ఝల్లన,
    ధనువును బాణములు వైచి తడయక జలముల్
    గొనివచ్చి మోము దుడువఁగఁ,
    గనుఁగవ దెఱచుటయుఁ, జూచి కడు భీతుఁడనై. ౯.

చ. అనఘ, యెఱుంగ నేను, మృగ
        యాపరతంత్రుఁడనై విధాతృశా
    సనమున నింత గంటి, నతి
        సాహసకర్మము సంభవించె, నా
    ఘనతిమిరంబు నప్పు డుద
        కంబుల నీ వటు కుండ ముంప నా
    నినదము హస్తినాద మని
        నెట్టన నేసితిఁ, దప్పు జేసితిన్. ౧౦.

వ. అనిన నమ్మునికుమారుం డల్లన నిట్లనియె.

మ. అడవిం దాపస వృత్తినున్న నను నే
        యం గారణం బేమి, నీ

యడ నేమె గ్గొనరించినాఁడ, నది దా
 న ట్లుండె, నీవార్తకుం,
గొడు కొక్కండయి పోయెనే, యనుచు నా
 క్రోశించుచుం జత్తుర
క్కఁడ నయ్యంధులు, మహాదుపాతకము లిం
 కన్నిన్నుఁ బొందెన్ గదే. ౧౧.

వ. అయినను నెఱుంగమింజేసి యేసితంతియకాదు, పశ్చాత్తా
 పంబునుం గలదు, గావున నిమ్మహా పాతకంబు నీకుం గా
 కయుండు, ననుచుం బలికి పదపడి.

క. బాణవ్యథచే మేనం
 బ్రాణంబులు నిలువలేవు, బాణముతోడన్
 బ్రాణములు విడువఁజన, దో
 క్షోణీశ్వర, దీనిఁ బెఱుకు, కొంకకు మింకన్. ౧౨.

చ. మహితసమాధియోగమున
 మద్గురు లిత్తెఱఁగెల్లఁ గాంచి దు
 స్సహ మగుచున్న శోకమునఁ
 జాలఁ దపించి శపించి రేని యా
 గ్రహపటురోషవహ్ని గొని
 కాల్చు భవత్కులమన్మహాటవిన్
 దహనము పేర్చునర్చుల ను
 దగ్రతఁ గానన మేర్చు చాడ్చునన్. ౧౩.

సీ. అదిగాన మును ముట్టనచటికి నీకుండ
 నుదకంబు గొనిపోయి మొదల వారి

తృషఁ దీర్చి, యిబ్భంగిఁ దెగియె మీఁకోడు, కిట్టి
తప్పుచేసితి, నని చెప్పి, యింక
నీగతోదకబంధ మేటికిఁ, బోనిమ్ము,
కడచన్న దానికి నడల వలవ,
దనుమాటలకు నేను నాఘోరసాయక
మతి భీతిఁ బెఱుక, న య్యతిసుతుండు
మేనుఁదొఱఁగె, నతని మృతి కేను శోకించి
కుండతోడ నీరు గొనుచుఁ దపసు
లున్న వనము చేర నొగిఁబోయి సుతురాకఁ
గోరుచున్నయట్టి వారిఁ గంటి. ౧౪.
అక్షివిహీనుల వృద్ధుల
నక్షముల దృఢాతురులను నగతుల ధ్యాతిం
బక్షములు విఱిగి యొఱగిన
పక్షుల గతి నున్నవారిఁ బరమవ్రతులన్ ౧౫.
క కని యల్లనఁ గదియఁగ, న
య్యనఘుఁలు నాకాలిచప్పు డాలించుచు, నో
తనయుఁడ, నీవిటు తడయం
జను నే యీయున్న యేటి సలిలంబులకున్. ౧౬.
గీ. ఏల రాఁడో యనుచు నేనును దల్లియుఁ
గలఁగఁబడితి, మెచట నిలిచి, తకట,
మధ్యరాత్రి మిట్లు మసలుదు రే, మాకుఁ
గన్నులన్న నీవ, గతియు నీవ. ౧౭.
క. జలతృష్ణ నీదురాకయు
తలపోయుచు నుండె, నింకఁ దల్లికి నుదకం

బులు వోయు, బుద్ధిచెప్పిన
నలిగిన యట్లల పలుక, వని పల్కుటయున్. ౧౮.

ఉ. దేహము దాహముం బొరయ,
దెంపునఁ జెప్పఁ గలంచి, పుత్త్రుపై
స్నేహముఁ జూచి చెప్ప నని,
చెప్పక పోదని, నిశ్చయంబుతో
సాహసబుద్ధిఁ జేసి, "ముని
సత్తమ, మీతనయుండఁ గా, న్మహా
ద్రోహగరిష్ఠుఁడన్, దశర
థుం డను పేరిటి పాపకర్ముఁడన్. ౧౯.

ఉ. ఎక్కడఁ జూడఁ జెప్ప నిటు
లెవ్వరుఁ జేయని యట్టి పాప మే
నొక్కఁడఁ జేసి మీకడకు
నోడక వచ్చితి, నేమి చెప్ప, ని
య్యెక్కడఁ జీఁకటిం జలము
లిమ్ములఁ ద్రావు రవంబు నిక్కరిం
దెక్కలి తూపు లేయుచును
ద్వీపమృగంబులఁ జంపుచున్నెడన్. ౨౦.

మీతనయుండును సరయువునం గుండ ముంప నాచప్పుడా
లించి విధివశంబున.

క. అంజక తత్తటమున నొక
కుంజంబునఁ బొంచి యుండి కుంభధ్వనికిం
గుంజర మని యేసితి, ముని
కుంజర, నీకొడుకు నేలఁ గూలం గోలన్. ౨౧.

వ. అప్పు డక్కుమారుండు.

క. బాణహతి నెలుఁగు చేసినఁ,
బ్రాణంబులు గలఁగఁబాఱి బాణము పెఱుకన్,
బ్రాణములు విడిచె, ననవుఁడు
బ్రాణంబులు ఝల్లనంగఁ బడి మూర్ఛిల్లెన్.

క. ఏమని చెప్పుదు, నిట్లను
నామాటయుఁ దెగకమున్నె హా పుత్రాయం
చామునిపత్నియు నప్పుడు
భూమింబడి యుండె రిత బొందియ పోలెన్. 93.

వ. ఇత్తెఱంగున మూర్ఛాపరవశులై యున్న యత్తపస్వులఁ
జూచి చిత్తంబు గలంగి యే నల్లన బోధింప, నెట్టకేలకుం దె
ప్పిఱి వారు నాదెసకు దీనవదనంబు లెత్తి నోళ్ళు దెఱచు
చుం బెదవులు దడుపుచు డగ్గుత్తికలు వెట్టుచు నెలుంగురా
ల్పడ ని ట్లనిరి.

సీ. ఏమయ్య మాపట్టి నింత పాపము సేసి,
త్రేమి చేసినఁ జావనేసి తయ్య,
తగునయ్య, వనమునం దపసుల మై యుండ
దయమాలి యీ తెంపుఁ దలఁతురయ్య,
చీఁకులు వట్టిన చేకోల యది పోయెఁ,
జీఁకుల మెచ్చోటఁ జేరువార,
మప్పుణ్యు నేసిన యమ్మున మమ్మును
బడనేసి దీవనఁ బడయవయ్య,
నీదు నిష్ఠుర బాణంబు నెఱఁకు దూఱఁ
గాఁడి పరవశుఁడై వ్రాలి కడఁక నపుడు

తండ్రి నేమని యెలుఁగిచ్చెఁ, దల్లడంబుఁ
జెంది తల్లి నే మని పిల్చెఁ, జెప్పుమయ్య. ౨౪.

ఉ. ఆగురుభక్తి తత్పరత
నాపరమవ్రతనిష్ఠ నాతపో
యోగవిభూతి నెప్పుడు గు
ణోన్నతుఁ డుత్తమచర్యుఁడు న్మహా
భాగుఁడు పుణ్యగర్విత వి
పద్దశ కర్హుఁడె, యట్టివాని కి
ట్టీగతి సంభవించెనఁట,
యేమని పొక్కుదు మింక, నక్కటా. ౨౫.

క. మతిఁదలఁప నొడ లనిత్యము,
మృతుఁ డవుఁ గా, కేమి మఱి నిమిత్తము లేదే,
యతిసుతుఁడఁట, నిర్ఘాతా
యతభీకర బాణపాతమఁట, పాపవిధీ. ౨౬.

వ. అనుచుం బెక్కుతెఱంగుల శోకించుచు నప్పు డత్తపోధనుం
డు నన్ను నుద్దేశించి.

శా. వానప్రస్థునిఁ జంపి యొక్కవడితో
స్వర్నాథుఁడుం దుర్గిఁ, ధా
త్రీనాథుండన నెంతవాఁడఁటఁ యిచా
రింపంగ, నీ కెంత నే
ర్పేనిం జావు శిరంబు వ్రక్కలయి, త
ప్పెం, దప్పె, నీకృత్య మ
జ్ఞానంబు న్గడునోడి చెప్పితివి ప
శ్చాత్తాపతప్తుండవై. ౨౭.

క. కావున నిన్నే మన, నిది
దైవాధీనంబ, యింక, ధరణీశ, మమున్
వేవేగ నచటికిం గొని
పోవుట పురుషార్థ, మనుచుఁ బొగులుచు వారిన్. ౨౫.

వ. ఏ నక్కుమారుం దున్నయెడకుం గొనిపోయి, వీఁడె మీతనూజుం, డనుటయుఁ, దడఁబడు చేతులతోడ ధరఁ దడవి కొడుకుమీఁదం బడి మూర్ఛిల్లి కొంతతడవునకుం దెలిసి విలపింపం దొడంగి, రంత నత్తల్లి, యుల్లం బెఱియ నెలుంగెత్తి హా యజ్ఞదత్తా, యనుచుం దనూజుం బేర్కొని.

సీ. అక్కట, నాతోడ నల్గినట్టున్నాఁడ,
వెన్నఁ జీరినఁ బల్కవేల, పుత్త్ర,
ప్రాణమై యుండియుఁ బాసి పోయితి వీవు,
ప్రాణంబు నన్నేల పాయ, దనఘ,
యంధుల మగు మాకు నాధార మగుచున్న
నిన్నేల నేసె నీనృపుఁడు, వత్స,
కడలేని దైవంబు కన్నుల కిదియును
ఘనమయ్యె నే మనం గలదు, తండ్రి,
కూన, యెల్లు నీదు గుణములు మఱతు, నెం
కేమి సేయుదాన, నెందుఁ జొత్తు,
నిషువు నాటు నప్పు డెంత భీతాత్ముండ
వైతొ, పాపజాతి నైతిఁ, దనయ.

చ. కొడుక, శిలీముఖం బెదటఁ
గూర్కొనె నిన్ను, నటంచు నెత్తుటం.

దడిసిన యక్కు చేక్కదడవి
తాత్పదరక్షత మంటి, కాలితిం,
బాడవటి పొక్కుతిం బొలిసి
పోయితిఁ, బొమ్మని కూర్మిఁ బుత్రుపైఁ
బడి కనుమూసి కొంతవడి
పల్కులుఁ జేష్టలుఁ దక్కి వెండియున్.

విధివశంబునం దెలిసి పెక్కు విధంబుల విలపించు చుండె నం
త నత్తపోధనుండు.

తనుఁ జూచి యాలింగనము సేయు, మలుగంగ
నిన్ను నే నే మని యన్నవాఁడఁ,
ఒఁకటి నేటికి, శిశువ, ని న్నొక్కనిఁ,
బట్టి పొమ్మన్నట్టి ఫలముఁ గంటి,
నే తనూజుని కింక నే వేదశాస్త్రంబు,
లనఘ, చెప్పుదుఁ బ్రజ్ఞ కలరి యలరి.
ఫలమూలజలములు భక్తితోఁ గొనివచ్చి,
తనయ, మమ్మెవ్వరు తనుపువారు,
కుశసముచ్చయంబు, కొడుక, యెవ్వరు తెత్తు,
రగ్నిహోత్రికలన మట్లు లుండె,
నధికవార్ధకమున నాత్మజ శోకంబు
ననుభవింపవలసె నక్కటకట.

గ్లాని
నిర్ఘృణాతఁ గడంగి మహా
ఘోరచరిత్రఫలంబు, నేఁడు, నేసెన్నోవిధి, యక్.
దీర్ఘాయు వనుట కర్థము
నిరత పటిష్ఠ బాణ నిహతియె, పుత్రా! ౩౨.

వ. అనుచుఁ బనవి పనవి.

ఉ. హా, యను; సోకుమార, యను;
నక్కట, పల్కవదేల, పుత్త్ర, పు
త్త్రా, యనుఁ; దల్లిఁ జూడు మనుఁ;
దమ్ముఁడ, తూఱఁగనాటెనే యమో
ఘాయతసాయకం బను; నృ
పాధముఁ డేటికి నేసెఁ, బట్టి, ప
ట్టీ, యను; నీకు నీగతి ఘ
టిల్లెఁగదే యను; దైవమా యనున్. 33.

వ. ఇట్లనేకప్రకారంబుల శోకించి * * * నన్ను నుద్దేశించి, యేము నిదె మాపుత్త్రుఁ గూడఁ బోవుచున్నారము, నీవుఁ బుత్త్రవియోగంబున మృతిఁ బొందం గలవాఁడ, వని నాకు శాపం బిచ్చి పత్నీసమేతుండై ప్రాణంబు విడిచె.

రామాయణము.

మణిపుర వృత్తాంతము.

సీ. కటిఁ బ్రాఁతముతుకపీర్కావిదోవతిపంచె
భ్రూమధ్యమున నూర్ధ్వపుండ్రకంబు
వక్షస్స్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణ
బిలమున నులివాఁడు తొలసియెన్ను
నంసభాగంబున నాయవారపుసంచి
దోర్మూలమున నిఱ్ఱితోలుసజ్జ
కుడికరంబున నఱుగుదు వేణుదండంబు
గూనివీఁపునఁ జింపిగొడుగుఁదడక

తనకు సలవడ వృద్ధవిప్రనివిధంబు
దాల్చుటయు గూర్మిసఖుఁడు సుతామసుతుఁడు
బ్రహ్మచారి యై తనవెంట రా మురారి
రత్నగరంబు సొచ్చి పూర్వత్రియామ. ౧.

* * * * * *

క. తలఁపులు హరిచింతనములు
పలుకులు హరికీర్తనానుభవములు పనిపా
టులు హరికృత్యంబులు భూ
తలమై కుంఠంబు పొగడఁదగు నిది యనుచున్. ౨.

ఉ. వేడుకతోడ నన్నగర
వీథుల నీగతి సంచరించుచున్
గ్రీడియు దాను వేకువత
ఱిన్ జని నర్మదలోన మజ్జనం
బాడి గమించి చొచ్చెను ద
దంతికరాజమరాళకూజితా
మ్రేడితకింకిణీరవప
రిష్కృత ఘోటము యజ్ఞవాటమున్. ౩.

క. చొచ్చి తదాస్థానమహిమ
కచ్చెరువందుచు వియచ్చరాహ్వానోద్గా
తృచ్చరితసామమంత్రము
ఖోచ్ఛ్వసను లంతరిక్ష మూటాడింపన్. ౪.

మ. క్రతుదీక్షాపరు విశ్వభూవలయుస
మ్రాణ్మౌళిమాణిక్యభూ

ష్ఠితపాదాంబుజు ఋత్విగావృతుఁ గుశా
సీను న్వధూసంయుతు
న్నితవబ్రాహ్మణు లిద్దఱుం గదిసి కెం
గే లెత్తి, బర్హిర్ధ్వజ
క్షితినాథోత్తమ, భద్రమస్తు, నుచు నా
శీర్వాదముం జేసినన్. ౫.

* * * * * *

క. జనవరుఁడు, పురాణములం,
దనఘా, యభ్యాగత స్స్వయంవిష్ణువు, నా
వినఁబడు, నినుఁ జూచిన నా
జనార్దనునిఁ జూచినట్ల సంతసమయ్యెన్. ౬.

క. కొంచక వేఁడుము, తగ న
ర్పించెద నిపు, డెద్ది నీయభీష్టము, నాకున్
గించిత్తయిన మనోధన
వంచన మిచ్చోట లేదవశ్యం, బనినన్. ౭.

సీ. భూపాల, విను, ధర్మపురి నుండు కృష్ణశ
ర్మాభిధానుఁడ, మదీయాత్మజుని వి
వాహంబునకు నీపురోహితుండు సుశీలు
నింటఁ గన్నియగల్గు టెఱిఁగి యడుగఁ
బయనమై వచ్చుచో భయదాటవీమధ్య
సీమ నాఁకలి గొన్న సింహ మొకటి
కవిసి పుత్రుని ఘోటకముఁ గూడఁ బట్టిన
విడిపింప నా కొండు వెరవు లేక

చింతతో, నటవ్యాం నరసింహా, యనుచు
నూటయెనిమిదిమాఱు లెన్నుకొని వరుస
నలఁతఁ గుత్తుక యెండఁగా, నవ్విభుండు
కరుణఁ బ్రత్యక్షమై, నన్నుఁ గావఁడయ్యె. ౮.

వ. ఇవ్విధంబున మహావ్యథం బరితపించుచున్న నన్నురూక్షేక్ష
ణంబుల నిరీక్షించుచు హర్యక్షంబు వాలవిక్షేపణంబుల నధి
క్షేపించి పుత్త్రిగాత్త్రంబు నఖరదంష్ట్రాంకురంబుల నప్పళించు
చు మనుష్యభాషణంబుల గద్దించుచు నన్ను నుద్దేశించి,
నాచేఁ బడిన జంతువుం గృతాంతు నంతవానికైన బలవం
తంబున విడిపింప నేఁతబంటె, శిష్యుండును నీవు నింటికిం జ
నుం, డని నిరాశంబుగాఁ బలికినఁ గ్లేశంబున నాశిశువుం
బాసి పోవఁ జాలక, బాలకవిహీనులగు మానవులకు నౌ
ర్ధ్వదైహికంబులు లేవు గావున నీవు మచ్ఛరీరంబు కబళం
బు గొని సుతశరీరంబు విడువు, మనిన, విని యక్కంఠీరవం
బకుంఠారవంబున, మావంటి దుష్టజంతువు లాసన్నమృత్యు
వునకు మూలభృత్యు లగుటం జేసి యిట్టి గతాయుఃప్రాణు
లంగాని మీవంటి దీర్ఘాయుఃప్రాణులం బట్టము, పట్టికొఱ
కింత పట్టి పెనఁగి వట్టి దురవస్థలఁ బొరలక మరలు, మని
న, మత్కృతంబులగు సుకృతంబు లర్పించెద, నెప్పాట ని
ప్పాపని చొప్పింపక నాకు నొప్పింపవే, యనిన, నీయకొన
క, నీయెడ నాకునయ్యెడు ప్రయోజనంబు లెయ్యవియు లే
వు, మయూరధ్వజునివలనం గాని, యనియె, అది నీవంగీక
రించెదవేని నెఱింగించెద, అనిన భూసురోత్తమునకు రాజ
సత్తముం డిట్లనియె.

క. ఆ కేసరి నరకేసరి
గాకున్న మదీయదేశకాననగిరుల
న్భీకరహారిదర్వీకర
సూకరనికరముల కెట్లు సుడియఁగవచ్చున్. ౯.

క. అడిగిన పదార్థమెల్లను
దడయక నీ కిత్తునని మొదల నాడితి, నా
నుడువు వృథగాదు, వలసిన
వడుగుము నీ, వన్న భూసురాగ్రణి విభుతోన్. ౧౦.

క. నీయెడ మముబోంట్లకు నే
లా యీసంశయము, దుర్బలస్య బలం రా
జా, యని పలుకు విశిష్ట
న్యాయము గలుగుట, మదార్తి హారియింపఁదగున్. ౧౧.

క. ఆసింహము నీదేహము
దా సగమిచ్చినఁ గుమారు దండింప, నన
న్నాసిలి, రాజుల తనువులు
గో సిమ్మనఁ దగునె పూనుకొని విప్రులకున్. ౧౨.

ఉ. నావుడు, సింహ మిట్లను, మ
హంబుస నన్నరనాథచంద్రిమున్
సేవలుఁగా దలంపకు, మ
కించనరక్షణ శీలుఁ డాత్మవి
ద్యావిదుఁ డుత్తమోత్తముఁ డు
దారుఁడు సూనృతవాది, గావున
న్ని విటు సంశయింప కత
నిం గని వేఁడు, ఫలించుఁ గోరికల్ ౧౩.

క. సీతనువు ముదిసి తపముల
చేతఁ బలలశూన్యమై కృశించిన, దాధా
త్రీతలపతిగాత్రము నవ
నీతసమము బహుసుఖప్రణీతం బగుటన్. ౧౪.

క. ఇది సింహభాషితము, ము
న్న దశరథాత్మజుఁడు బ్రాహ్మణుని మృతశిశువుం
బ్రదికింపఁడె, రాముఁన కే
కొాద, నీ వెట్లయినఁ బుత్త్రికుని గావు, మనన్. ౧౫.

సీ. కువలయేశ్వరుఁ డియ్యకొని మంత్రి హితపురో
హితబంధుజన మహీపతులఁ జూచి
రాజున కర్థంబు రణమునం దైన బ్రా
హ్మణునెడనైన దేహంబు విడువ,
మును శిబి కర్ణ జీమూతవాహులు పరా
ర్థమగాదె నిజశరీరములు విడిచి,
కే నీమహాత్మునకై నాతనువులోన
నర్ధమిచ్చితి, దీని కడ్డపడకుఁ,
డని సుచిత్రుని సకలరాజ్యాభిషిక్తుఁ
గాఁ బ్రతిష్ఠించి మేఖలకన్యకాంబు
వులఁ గృతస్నానుఁడై దానములు బహుప్ర
కారములఁ జేసి విప్రపుంగవునిఁ బిలిచి. ౧౬.

క. పూతజలాక్షతములు గొని
దాత, మదీయార్ధదేహదానేన హరిః
ప్రీతోభవ, తని భూసురు
చేత నృపతి ధారవోసి చిత్తమెలర్పన్. ౧౭.

ఉ. సత్రవితర్దికాస్థలి వి
శంక దృఢాసనుండై ముకుందు లో
కత్రయవందితున్ హృదయ
కంజమునం బదిలించి కేతకీ
పత్రములీల మాళిఁ గర
పత్రము పూనెడు నంతఁ బుణ్యచా
రిత్రి కుముద్వతీసతి యె
ఱింగి వడిన్ జనుదెంచి భర్తతోన్. ౧౮.

క. నీయర్ధ శరీరము కా
నా యేను మదీయదేహ మర్పించి నిజం
బీయెడ నిలుపు, మనిన విని
యా యువనిసురుఁడు పలికె నధిపునితోడన్. ౧౯.

క. సింగము నాతో నృప వా
మాంగము స్త్రీభాగ, మది యనర్హము భుజియిం
పం గొఱగా, దనె నీవు
న్యాంగన తను విచ్ఛగింప దమ్మృగ, మనినన్. ౨౦.

సీ. సుతుఁడైన తామ్రధ్వజుఁడు శాంబరీవిప్రు
నకు నిష్ఠులనియె వందన మొనర్చి,
భూసుర, యోవై పితాసపుత్రి, యటంచు
ననియెడు శ్రుతిరహస్యంబు వినవె,
జనకుని దేహంబు సగమేల, నాశరీ
రము సింహమునకు సర్వంబునిత్తుఁ
దడయ కేనును ఋణత్రయ విముక్తుండనై
తండ్రికై కొన్నసత్యంబు నెఱపి

శాంతనవరాఘవుల కీర్తిఁ గాంతు, ననిన
బ్రాహ్మణుఁడు పల్క, మృగరాజు పలుకు వినుము,
రాజదేహంబుఁ దక్కళతంబు సుతుఁడుఁ
గోయవలె, ననె, నది గల్ల సేయఁదగునె. ౨౧.

గీ. అనిన దరహాసితాస్యుఁడై యవ్విభుండు
సుతునిఁ దనరాణివాసంబుఁ జూచి, యట్లు
చేయుఁ, డని చేతి యంపమిచ్చిన సుచిత్రుఁ
డందనోడఁ, గుమద్వాతి యందుకొనియె. ౨౨.

వ. అట్లందుకొని.

లయగ్రాహి. ఆరమణియుం దనకుమారకు నదల్చి యతి
దారుణతర క్రకచధారఁ బతిమౌళిం
జేరిచి మదిన్, హరి, హరీ, రఘుపతీ, యనుచు
వా రిరువురు న్దలుగఁగా రుధిరముల్ ధా
త్రీరమణుగాత్రమున మేరుశిఖరిం దొరఁగు
గైరికఝరంబుల ప్రకారముగ హాహా
కారములు సేసె హితసూరిజన బంధుపరి
వార నికరంబులు మహారవముతోడన్.

ఉ. ఇమ్మెయి వ్రక్కలింప ధర
ణీశ్వరుఁ డాపలికంట బాష్పతో
యమ్ములు గ్రమ్మఁ గన్గొని ధ
రామరుఁ డిట్లను, నార్తినిచ్చు దా
నమ్ము పరిగ్రహింపఁ దగు
నా, యనపత్యతవంక నూర్థ్వలో

కమ్మలు లేకపోయినఁ బో
కాలఁగని, మ్మని యల్గి పోవఁగన్. ౧౮.
గీ. కాంత, ప్రాణేశుమస్తంబుఁ గదియఁబట్టి,
యకట నీదేహ మూరక కిట్లయ్యెఁ గాని
బ్రాహ్మణుఁడు నిన్ను లేని నెపంబు వెట్టి
యలిగి పోవుచునున్నవాఁ, డన విభుండు. ౧౯.
మ. అవు డావిప్రునిఁ జూచి యిట్లను, మహా
త్మా, మచ్ఛరీరంబులో
నపసవ్యాంగము దానయోగ్యమయి స
వ్యాంగంబు గాకున్న దుః
ఖపడెన్, అంపము నొప్పినైన నిరువం
కం బాష్పముల్ రావె, స
త్కృప నీభాగము గా, మ్మనన్, విజయుతోఁ
గృష్ణుండు ప్రత్యక్షమై. ౨౦.
శా. ఆరాజన్యునిఁ గౌఁగిలించి, ధరణీ
శా, నీవు ధన్యుండ, వీ
ధీరత్వంబునకున్ వదాన్యతకుఁ బ్రీ
తిం బొందితిన్, బుత్త్రిసా
ధ్వీరత్నంబులతోడ నధ్వరము వీ
తిద్వంద్వయుక్తంబుగాఁ
బ్రారంభింపుము, కర్మకర్తనయి ని
ర్వర్తింతు నే సర్వమున్. ౨౧.
క. పోర నెదిరి భవదీయకు
మారుం డొక్కరుఁడ గెల్చె మము నిద్దఱ, నీ

పేరీతి దేహ మొసఁగితి,
వేరీ మీసాటి వీర వితరణగరిమన్.

జైమిని భారతము

## ప్రళయకాలము.

వ. కృత త్రేతా ద్వాపర కలినామంబులైన యుగంబులు నాలు గును బండ్రెండు వేల దివ్యవర్షంబులం బర్యవసితంబులగు, నీయుగంబులు నాలుగు నొక్కమహాయుగం బనం బరఁగు, నమ్మహాయుగసహస్రపర్యంతంబయిన కాలంబు బ్రహ్మకు దివం బనఁబడుఁ, దద్దివసావసానంబునందు శతవార్షికంబైన యనావృష్టిదోషంబు ప్రవర్తిల్లు, నప్పుడు.

గీ. సప్తహయుఁడు మూర్తిసప్తకంబు ధరించి
కరము వేఁడిమిగులుకరము లొప్ప
నదనదీజలములు నుదధిజలంబులుఁ
బీల్చి జగములెల్లఁ బ్రేల్చుఁ గడఁగి. ౧.

చ. దినకర తీవ్రతేజమున
దీప్తహుతాశనుఁ డయ్యుగాంత సం
జనిత మహాసమీరణ వ
శంబునఁ జేర్చి నగవ్రజంబుతో
మనుజులతోడ నిర్జర స
మాజముతోడ భుజంగపంక్తితో
దనుజులతో జగత్త్రియము
తత్క్షణమాత్ర నొనర్చు నీఱుగాన్. ౨.

వ. తదనంతరంబ.

మ. సితపీతారుణనీలపింగరుచులై
స్నిగ్ధంబులై యుద్యతా
యతవిద్యుల్లలితంబులై ఘనగిరీం
ద్రాకార ఘోరంబులై
తతనిర్ఘాత నిపాతభీమ భిదుర
ధ్వానంబులై సంతతో
త్థితసంవర్తవలాహకంబులు వెసం
దోతెంచు దిగ్భిత్తులన్. ౩.

ఉ. పెల్లుగఁ బాఱు తజ్జలము
పెక్కువ నెక్కట నమ్మహానలం
బెల్లను నాఱిపోవుఁ, బృథి
వీశ్వర, యేఱులు నబ్ధులున్ వెసన్
దొల్లిటి యట్ల నిండుఁ, బటు
తోయద సంఘము లంత బోక గ
ర్జిల్లుచు వెండియుం గురియుఁ
జత్రముగాఁగ ననేకకాలముల్. ౪.

శా. ధారాపాత నితాంత వేగమున ని
ర్ధాత్రీతలం బాహతం
బై రూపేది మునుంగుఁ దోయములలో,
నత్యంతగంభీర వాః
పూరం బంతయు ముంచి మించుటయు ది
గ్భూమీ నభోభాగముల్

వే రూపింపఁగరాక యుండఁ దమముల్
వేష్టించుఁ ద్రైలోక్యమున్. ౫.

గీ. అంతఁ బరమేష్ఠిచోదితమైన యొక్క
మారుతము నలిరేగి దుర్వారభంగి
విలయకాలవిశృంఖలవిపులవారి
ధరచయంబుల నెల్లను విరియనడఁచు. ౬.

క. ఆమారుతంబుఁ గ్రోలి పి
తామహుఁ డెంతయును ఘోరతమమగు నలిల
స్తోమంబునందు నడుమం
దామరపై నిదురవోవుఁ దద్దయు నెమ్మిన్. ౭.

భారతము.